సీ. పల్లవంబులమించు పదముల రతనంపు
టందియల్ ఘల్లు ఘల్లనుచు మ్రోయ
ఘననితంబములందుఁ దనరారు బంగారు
మొలనూలిఘంటలు మురువుఁ జూప
శృంగారములమీఱు కెంగేలుదమ్ముల
నీలంపుగాజులు చాల మొరయఁ
దపనీయమయరత్నతాటంకములు మంచి
నిద్దంపుచెక్కుల్ల నిగ్గులీన

గీ. సరులఁ బెనఁగొని పాలిండ్లు సారెఁ గులుకఁ
గాను లసియాడ మదహంసగతులు మెఱయ
వనితలును దాను శృంగారవనముఁ జేరె
భావ మిగురింప నల యుషాభామ యపుడు. 26

క. ముక్కంటి గౌరి యవ్వని
మిక్కిలిఁ బ్రేమంబుమీర మెఱయంగా నా
మక్కువఁ గని యుమ తనమది
నక్కట! యిట్లుండవలదె! యనుచుఁ దలంచెన్. 27

చ. అల యుమఁ జూచి గౌరి వదనాంబురుహంబున మందహాసముల్
చెలఁగఁగ మమ్ముఁ జూచి యిటు చింతిలనేటికి? నిట్టిభాగ్యముల్
గలుగును నీకు నింక ననఁ గల్గునో! యెన్నటికంచు సిగ్గునం
బలుకఁగ మోము వంచు నల భామినిఁ గన్గొని పల్కె నీగతిన్.

సీ. జలజాక్షి! వినుము వైశాఖమాసమునందు
భాసురంబగు శుక్లపక్షమునను
రహిమించు ద్వాదశీరాత్రి నీకలలోన
నెవ్వఁడు పొందు నిన్నలమి వతఁడె

పతియగు నీకని భావంబురంజిల్లఁ
బార్వతి పలికిన పలుకులకును
హర్షించి యెంతయు నాత్మలో నుప్పొంగి
గౌరికి మ్రొక్కుచుఁ గౌరవమున

గీ. బంతిఁ గూర్చుండి యంతట బాగుమీర
రమణులును దాను వనభోజనము నొనర్చి
పరఁగ బాణాసురునిముద్దుపట్టి యపుడు
నిజనివాసంబుఁ జేరెను నెమ్మితోడ. 29

వ. అంత.

క. సురగరుడయక్షరాక్షస
వరకన్యలు చేరి కొలువ వైభవమమరన్
దొరతనముమీరఁ యెంతయు
సరసిజముఖి యుండెఁ జాలసంతస మెసఁగన్. 30

—: పార్వతి వరానుసారముగ నుష కలఁ గనుట :—

క. కులగిరికన్యక పల్కిన
చెలువున వైశాఖమాససితపక్షమునం
దలరెడు ద్వాదశిరాత్రిని
జలజేక్షణ నిదురవోవుసమయమునందున్. 31

సీ. చంద్రికనిరసించుసరణిచే రాణించు
చిరునవ్వు మోమునఁ జెలఁగువాఁడు
తామర రేకులఁ దా నెంత లేదను
వెడఁదకన్నులుఁగల్గి వెలయువాఁడు

తులకించుకొండపండులఛాయఁ దెగడెడు
మురువుచేమించు కెమ్మోవివాఁడు
పాంచజన్యముతోడఁ బ్రతివచ్చు ననవచ్చు
కలితరేఖలఁబోల్చు గళమువాఁడు
గీ. నురము బంగరుతల్పన నొప్పువాఁడు
భోగిభోగాభభుజములఁ బొలుచువాఁడు
లలితగజరాజగమనంబుఁ గలుగువాఁడు
కనకములమించునిరసించు కాంతివాఁడు. 32

సీ. సంపంగిపువ్వులు సరసత సిగఁ జుట్టి
బురుసాకుమాల్గట్టి పొంకమమర
నర్ధచంద్రునిసొంపు నదలించు నుదుటను
దీరుగాఁ దిలకంబు దిద్ది వేడ్క
శ్రీకారములమించు చెలువంబుఁ గల్గిన
వీనులఁ జౌకట్లు వెలయ నుంచి
బటువుము త్తియములఁ బాగుగాఁ గూర్చిన
కంటసరుల్ దాల్చి ఘనతమీరఁ
గీ. దనర నురమున వజ్రాలతాళి వైచి
హస్తములఁ గెంపులకడియా లలరఁ బూని
వసుధ జీరాడు చుంగులవన్నెఁ గాంచు
మేటి కనకాంబరమువలె వాటుదనర. 33

క. బంగరుమంచముమీఁదను
సంగతిఁ గూర్చుండి మిగులసరసత్వముచే
నంగనఁ దగ రారమ్మని
శృంగారరసంబుమీఱ చెలువంబమరన్. 34

సీ. గందంబు మైఁ బూసి కౌఁగిటం జేర్చుచుఁ
గస్తూరి దిద్దుచు గారవించి
సంతసంబునఁ జేరి చక్కెరమోవివాని
బటువుగుబ్బలు జీరి బాగుమీర
గళరవంబులుఁ జేసి కళలంటి సొక్కించి
చెక్కిలి నొక్కుచుఁ జెలువమమరఁ
దొడలపై నుంచుక తొయ్యలి రమ్మని
వుక్కిటి విడెమిచ్చి బుజ్జగించి

గీ. చాలఁ జనవిచ్చి మిక్కిలి సరసముగను
గొప్ప దువ్వుచు విరిసరుల్ గూర్చి వేడ్కఁ
దేటమాటల లాలించి తేనె లొలుక
రతులఁ దేలించెఁ గలలోన రమణుఁ డొకఁడు. 85

—: కలఁగని మేల్కొన్న యుష కలఁగఁగాఁ జిత్రరేఖ
సమాశ్వాస పరచుట :—

చ. కలఁగని మేలుకాంచి తనకంఠము నంటిన గోటిజీరలున్
బలుచనిమోవిపై మిగుల బాగుఁగ నుంచినయట్టి కెంపులుం
గులుకు మెఱుంగు గబ్బివలిగుబ్బల నించిన గంధసారముల్
బలుమరుఁ జూచి సోద్యపడి భావములోనఁ గలంకఁ జెందఁగన్.

వ. అచ్చటికి నెచ్చెలియగు చిత్రరేఖవచ్చి మాన్య యగునుషాకన్యం జూచి యిట్లనియె,

సీ. అక్కరో ! నీవేల ? యాత్మలోఁ గలఁగెదు
వేగంబ తెల్పవే వివరముగను
సకలదిక్పతులను సమరంబులో గెల్చి
సరిలేకయుండ నీజనకుఁ డెపుడు

నైరావతము నెక్కి నాయింద్రుఁ డెప్పుడు
చెప్పినయుడిగంబు సేయుచుండ
ఫాలలోచనుఁడును బ్రమథులతోఁగూడి
గొల్లయై వాకిటం గొల్చియుండ

గీ. నొవర నంతఃపురంబున నున్న నీకు
నింత భయమేమిటికి ? వచ్చె నిందువదన !
భావ మిది యని పల్కవే పద్మగంధి !
చెలియ నాకన్న నాప్తులే చెలులు నీకు ? 37

—: ఉష స్వప్నవృత్తాంతమును చిత్రరేఖకు తెల్పి వగచుట :—

వ. అని పల్కిన చిత్రరేఖనుం జూచి యుష యిట్లనియె.

సీ. మొలక నవ్వులవాఁడు కలువలచెలికాని
మురువుఁగైకొను ముద్దుమోమువాఁడు
వెడఁదకన్నులవాఁడు వేదండతుండాభఁ
గొమరొందు బాహుకాండములవాఁడు
చిన్నిపాయమువాఁడు చిగురుకైదువజోదు
రీతినొప్పెడు రూపరేఖవాఁడు
నిద్దంపుజిగివాఁడు నీలమేఘములీల
రహియించు చికురభారంబువాఁడు

గీ. కలితశృంగారలక్షణగరిమవాఁడు
చెలువుఁ డొక్కఁడు ననుఁజేరి చెలువుమీరి
కౌఁగిటను జేర్చి మోవాని కంతుకేళిఁ
గలయు నంతట మేల్కంటిఁ గలువకంటి ! 38

క. కలలోఁ జేసిన చిన్నెలు
తలపఁగఁ బ్రత్యక్షమానె తా మేల్కనినన్
నెలకొనియున్నది యిపుడును
బలుకదు నేమనుచు నీకుఁ బద్మదళాక్షీ ! 39

సీ. తండ్రిదగ్గఱఁ బోయి తలిరాకుఁ బోసిరో !
యేగతి ? నిల్తునే యెమ్మెమీరఁ
గన్న ! యిదేమని కన్నతల్లడిగిన
నుత్తరం బేమిత్తు ? నువిద ! యిప్పుడు
నన్నదమ్ములు చూచి యాత్మ సంశయమంద
నేమని ? తెల్పుదా నిందువదన !
బంధువర్గమునెల్ల భావించి పరికింప
మఱుఁ గెటువలె సేతు ? మచ్చకంటి !

గీ. కులసతులప్రోల నెటువలె నిలుతునమ్మ !
యట్టి బలివంశమునఁ బుట్టినట్టి తనకు
వనిత ! రావచ్చునా యపవాద మిట్లు
జగతి సరివారిలో నెట్లు సంచరింతు ? 40

—: చెలులు బాణపుత్రికి ధైర్యము చెప్పుట :—

క. ఇటు వగచిన యుమఁ గనుఁగొని
కటకటనుచుఁ జెలులు చాలఁ గళవళపడుచున్
గుటిలాలకమదికప్పుడు
దిటవు గలుగఁ బలికి రిట్లు తేటపడంగన్. 41

మ. వినవమ్మా ! దనుజేంద్రపుత్రి ! వలదే వేమారుఁ జింతింపఁగా
నెనయ న్నీచరితంబు లేమెఱుఁగమా యేకార్యముల్ జేసినన్
దనరన్ మంచివికాని కాని వగునే ధర్మంబు నీసొమ్ముగున్
వనజాక్షీ ! కలలోని సంగమమునన్ బాపంబు రానేర్చునే. 42

వ. అని మఱియు నిట్లనిరి.

సీ. కడు మనోవాక్కాయకర్మంబులందుఁ దా
నెవ్వాండు కలుషంబులే రొునర్చు
నది పాపమగుఁ గాని యతివరో! నీకును
గల పురుషునిఁ గూడఁ గలుష మగునె
సత్కాలంబందును సరసత జన్మించి
రూపరేఖలచేత రూఢి కెక్కి
నలుగు రౌనన మంచినడకఁ గల్గిన నీకు
నీవిచారంబేల? యిందువదన!

గీ. యనుచు నూఱడఁబల్కఁగ నతివలెల్ల
మదివిచారంబు మానని మగువకడకుఁ
జేరి కుంభాండపుత్రి యాచిత్రరేఖ
పలికె నిట్లని యాయింతిభావ మలర. 48

—: చిత్రరేఖ పార్వతి వరమును జ్ఞప్తికిఁ దెచ్చుట :—

సీ. వనజాక్షి! యుద్యానవనముఁగోపల నాఁడు
పార్వతి పలికిన పలుకులెల్ల
మఱచితిగాఁబోలు! మక్కువమీరంగ
నే వివరించెద నిపుడు వినుము
శుకవాణి! వైశాఖశుక్లపక్షంబున
నలువొందు ద్వాదశినాఁటిరాత్రి
కలఁగూడు పురుషుండె కాంతుఁడౌ ననియును
నతఁడును శౌర్యాఢ్యుఁ డౌనటంచుఁ

గీ. బలికెఁ గదవమ్మ! నీతోడఁ బంతమలర
గౌరిపలుకేల తప్పును? కలఁకమాని
సంతసంబున నుండుము సకియ! యనినఁ
జిత్రరేఖకు నిట్లనెఁ జెలువ యపుడు.

—: ఉష తాను కలను జూచిన కాంతుని దెమ్మని
చిత్రరేఖతో ననుట :—

చ. మఱచిన కార్యమియ్యెడను మానిని ! నీవు తలంపఁజేసితోఁ
బరగఁగ నాఁడు గౌరి తగఁ బల్కినరీతిని గంటి స్వప్నముం
దరుణిరో ! యింక సేయఁదగు తక్కిన కార్యముదేమి యన్న భా
సురగతి నిన్న నేఁ గలను జూచినచెల్వుని జూపవే సఖీ ! 45

క. అని పల్కిన చెలిమాటలు
విని భావమునందుఁ జాలవేడుకమీరన్
వనజాక్షిఁ జూచి ప్రేమం
బెనయఁగఁ గుంభాండపుత్రి యిట్లని పలికెన్. 46

సీ. కమలదళాక్షి ! నీకలలోన వచ్చిన
పురుషుఁ డేకులమునం బుట్టినాఁడొ !
పరికింప నెటువంటిబలిమిఁ గల్గినవాఁడొ !
యెటువంటికీర్తిచే నెనయువాఁడొ !
రూఢిచే నెటువంటిరూపుఁ గల్గినవాఁడొ !
కనుపట్టు నెటువంటికాంతివాఁడొ !
తెలియంగ నెటువంటిదేశమేలెడువాఁడొ !
యేవిలాసముచేత నెసఁగువాఁడొ !

గీ. యొక్క గుఱుతైన నాతోడ నువిద ! నీవు
తెలుపకుండిన నెటువలెఁ దెలియవచ్చు ?
చోరుఁడై యంతిపురమును జొచ్చివచ్చి
మగువ ! నినుఁగూడు నతఁడు సామాన్యుఁ డగునె ! 47

క. బలిసుతుఁ డేలెడు నీపురి
బలవైరియుఁ జేరవెఱచు బాణాసురునిన్
గెలువఁగఁ జాలిన పురుషుఁడు
గలుగుట నీభాగ్యవశము కంజదళాక్షీ ! 48

ఉ. గౌరియనుగ్రహంబునను గల్గెను నీ కిటువంటిభాగ్యముల్
నీరజనేత్ర! తామసము నీ వొనరింపఁగ నేల? వేగమే
యూరును బేరునున్ దెలిసి యొద్దిక సేయుద మెల్లకార్యముల్
శ్రీరమణుండు నీతలంపుఁ జేకుఱసేయును నేటరేపటన్. 49

వ. అని పల్కిన.

క. మరుకాఁకలచే మిక్కిలిఁ
బరవశవై చాలభ్రమసి భామామణి! నా
వరుఁ దోడితెచ్చి చూపుము
పరఁగన్ సరివారలెల్లఁ బ్రస్తుతిసేయన్. 50

వ. అని మఱియును,

చ. మలయజగంధి యెంతయును మాటికి మాటికి వెచ్చనూర్చుచున్
బలుమరుఁ దాను గన్నకల భావములోపల నెంచిచూచుచున్
వలపులవింటివాఁడు కడువాఁడిశరంబుల నేయ సోలుచున్
నెలఁతుక చిత్రరేఖఁ గని నెమ్మిని నిట్లని పల్కెఁ గ్రమ్మరన్. 51

క. కలలోఁ జూచిన పురుషుని
నెలఁతుక! యిటుదెచ్చి కూర్చు నెనరున ననుచున్
బలుమరు నీగతిఁ బల్కిన
జలజాక్షికిఁ జిత్రరేఖ సరసత ననియెన్. 52

—: చిత్రరేఖ చిత్రపటముల వ్రాసి దెచ్చుటకై యరుగుట: —

సీ. ఉవిదరో! వినవమ్మ! యూరుపేరెఱుఁగక
యేరీతిఁ దేవచ్చు? నిటకు నతని
నయినను నానేర్పు నాయుపాయంబునఁ
జిత్రపటంబునం జెలువుమెఱయఁ

త్రిజగంబులందును దేజంబుచేతను
బలపరాక్రమములఁ బ్రబలునట్టి
గీర్వాణదానవకిన్నరగంధర్వ
వసుమతీనాథుల వ్రాసి తెత్తు

గీ. సప్తదినములలోనను సరవిమీర
నపుడు నీభర్త వీఁడని యంటివేని
యతని దోడ్తెచ్చి నినుఁగూర్తు ననుచుఁ బల్కి
పటము వ్రాయంగఁ జనియెను బద్మగంధి. 53

—: ఉష విరహతాపము :—

వ. అంత.

క. కటకట ! సప్తదినంబులు
నెటువలె నేఁ గడపు దాన నీవిరహాబ్ధిన్
దిటముగఁ బల్కిన నెచ్చెలి
పట మెప్పుడు తెచ్చుననుచు భామామణియున్. 54

సీ. చెక్కిటఁ జేయిడి చింతచే మిక్కిలిఁ
గంతునిబారికిఁ గలఁగుచుండు
నిట్టూర్పువుచ్చుచు నెమ్మిలో నెంతయుఁ
దుమ్మెదమ్రోఁతకుఁ దూలుచుండు
వసుమతి బొటవ్రేల వ్రాయుచున్ బ్రేమచేఁ
గోయిలరవళికిఁ గుందుచుండు
నివ్వెఱఁగందుచు నెనరుతో నెంతయు
శుకముపల్కులకును సోలుచుండుఁ

గీ. బరఁగ నలుదిక్కులను జూచి భ్రమయుచుండు
నెపుడు పతిఁ జూతు నేనని యెంచుచుండుఁ
దనరఁ దనలోన కాంతుని దలఁచుచుండు
మనసుఁ బ్రియుమీఁదనే నిల్పి మఱిఁగియుండు. 55

సీ. తనర నేఁ జేసిన తపములు ఫలియింపఁ
జెలఁగి నాథునిసేవఁ జేయవలదె
కడుమించు నామదికాంక్షలు చేకూరఁ
జెలువుని కౌఁగిటఁ జేర్పవలదె
తమిమీఱ నామేనితాపంబు చల్లారఁ
బ్రాణవల్లభునిమో వానవలదె
ముదముతోడుత నాదు ముచ్చటదీరంగ
ననశయ్యఁ బ్రియునిఁ బైకొనఁగవలదె

గీ. యనుచుఁ జింతించు మాటికి నొర యుంచుఁ
దలఁకుఁ దలయూఁచుఁ దనలోనఁ దత్తఱించుఁ
జిమ్మరేఁగినవలపులఁ జిక్కి మిగుల
విరహపరితాపభరమునఁ దరుణి యపుడు. 56

మ. మకరాంకాకృతి నాథుఁడొక్కరుఁడు ప్రేమన్ జేరఁగావచ్చి మ
చ్చికమీఱన్ మరుకేళిఁగూడి కలలోఁ జెన్నొంద లాలించుచో
నకటా! యేఁటికి మేలుకొంటి నిఁక నే నారాజకందర్పుతో
రకమాఁకూటమిఁ గూడుటెన్నఁడో! మదిన్ రంజిల్లుటెంకన్నఁడో!

సీ. ఏనోము నోఁచెనో! యెలమితో రమణుండు
చేపట్టి లాలించు చిగురుఁబోణి
యేపూజఁ జేసెనో! యేచినతమి నాథుఁ
బైకొని క్రీడించుభాసురాంగి

యేమేలొనర్చెనో! యేప్రొద్దుఁ బ్రాణేశు
కౌఁగిట మెలఁగెడు కంబుకంఠి
యేపుణ్య మొనరించెనో! పేర్మి వల్లభుఁ
బొలయుల్క నదలించు పుష్పగంధి

గీ. యెంత భాగ్యంబుఁ జేసెనో! యెపుడు విభుని
మనసురా సేవయొనరించు మచ్చకంటి
యెట్టి వేలుపుఁ గొల్చెనో! యేకరీతి
వరుఁడు చనవిచ్చి మన్నించు వన్నెలాఁడి. 58

వ. అని మఱియును.

సీ. కాంతుండు కన్నులఁ గట్టినయటులైన
నోరి! రారా! యని చేరఁబిలుచుఁ
బ్రేమతో రమణుండు పిల్చినయటులైన
నెనరుతో నేమిరా! యనుచుఁ బలుకుఁ
బ్రియముతో నాథుండు పెదవానినటులైన
నొకవింత సీత్కృతు లొనరఁజేయుఁ
జెలువుండు గళరవంబులుఁ జేసినటులైన
వీనులవిందుగా వినుచుఁ జొక్కు

గీ. మోడిఁ గైకొన్న యటులైనఁ గోడెకాఁడు
చాల వలచితి సొలసితిఁ గేళినేలు
వేడుకలుమీఱ నన్నంచు వేఁడుకొనును
గాంత మరుమాయచేత విభ్రాంత యగుచు. 59

సీ. పెంచిన చిల్కను బ్రియముతో రమ్మని
పద్యముల్ జెప్పదు పద్మగంధి
రాయంచగములను రమణఁ జేరఁగఁబిల్చి
నడువులు నేర్ప దానళిననేత్రి

నెమ్మిగుంపుల నెల్ల నెమ్మితో రమ్మని
యాడింపఁగా నెంచ దలఁచుఁబోణి
శారిక రమ్మని చనవిచ్చి మిక్కిలి
మాటలాడింప దామందయాన

గీ. ప్రియముమీరంగ బొమ్మల పెండ్లి జేసి
కొమరుఁగుల్కంగ గుజ్జనగూళ్లు వండి
పడఁతులకుఁ బెట్టె నొల్ల దప్పంకజాక్షి
విరహభారంబు చేతను గరఁగి మిగుల. 60

—: విరహభరముచే తపించుచున్న యుషాకన్యఁజూచి
చెలులు తాపకారణము నడుగుట :—

క. నలకొను విరహముచేతను
గలఁగుచు నీగతిని జాలఁ గళవళపడు నా
పొలఁతుకఁ గని యొక నెచ్చెలి
పలికెఁ నెచ్చెలులఁ జూచి భావ మెలర్పన్. 61

సీ. చెలులార! కంటిరా చెలువ యున్న తెఱంగుఁ
బలువగలై తోఁచె భావమునను
గులమున కెంతయుఁ గొదవ వచ్చె నటంచుఁ
గుందియున్న తెఱంగో! కుందరదన
కలలోనఁ గలసినకాంతునిఁ దలఁచుచు
విరహాన నున్నదో! వెలఁది యిపుడు
బుద్ధిచాతురిచేతఁ బొలఁతుక లందఱు
నిశ్చయింపుఁడు వేగ నేర్పుమీర

గీ. నసురనాథుండు వినెనేని యాగ్రహించు
నిందుల కుపాయ మేమింక నింతులార!
యనిన వారలలో నొక్క యలరుఁబోణి
నెమ్మి నిట్లని పల్కెను నిశ్చయించి. 62

క. తరమిడి తనలో నవ్వుచుఁ
గరఁగుచు నలుదిక్కు జూచి కళవళపడు నీ
కరిరాజగమనఁ జూచిన
మరుశాఁకయె సిద్ధమనుచు మగువలతోడన్. 63

గీ. పలికి మనమెల్ల నిప్పు డీపడఁతిఁ జేరి
తెలియ నడుగుద మింకను దేటపడఁగ
ననుచు నాలోచన యొనర్చి యందముగను
బలికి రిట్లని యువఁ జూచి భావమలర. 64

సీ. ఇంతఁ జింతింపంగ నేలనే ? యెలనాగ !
పలుకవే మాతోడఁ బద్మగంధి !
యెంతకార్యంబైన నే మిందఱముఁ గల్గఁ
గలఁగ నేఁటికి ? నీకుఁ గలువకంటి !
కలలోనఁ బతిఁగూడఁ గులము వారలకెల్లఁ
గొదవంచు నున్నావొ కుందరదన !
యానాథుఁ బలుమఱు నాత్మలోఁ దలఁపుచు
విరహాన నున్నావొ సరసిజాక్షి !

గీ. తెలియఁబల్కుము వేగమే తేటగాఁగ
ననుచుఁ బల్కువయస్యలయాననములుఁ
జూచి యెంతయు సిగ్గుతో సుదతి యపుడు
మనను డాఁచంగ నేరక యనియె నిట్లు. 65

—: చెలులకుఁ దనతాపకారణముఁ దెలిపి వారితోఁగలసి యువ
శృంగారవనమునకు మన్మథు నారాధించుటకై చనుట :—

ఉ. ముచ్చటమీఱ నాకలను మోహముతోడుతఁ గూడునాథుఁడే
యచ్చెరువొంద నాయెదుట నందముగుల్కఁగ నున్నయట్లుగా
నిచ్చటఁ దోఁచెఁ గన్నులకు నేమని ! తెల్పుదు నిట్టిమోహముల్
వచ్చునివింటిజోదు పెనుబారికి నేగతి నింకఁ దాళుదున్. 66

వ. అని మఱియు నిట్లనియె.

సీ. అల్ల కుంభాండుని యాత్మజయైనట్టి
చిత్రరేఖ యిపుడు చెలువుమీరఁ
ద్రిజగంబులను గల్గు తేజోనిధుల నెల్ల
సప్తదినంబుల సరసరీతి
వ్రాసి తెచ్చెద నని వన్నెమీరఁగఁ బల్కి
పటముఁ దే నరిగెను బంతమలరఁ
దుంటవిల్తుఁడు వాఁడితూపుల నేయంగ
గడియ యొక్కయుగంబుగాఁగఁ దోఁచెఁ

గీ. ప్రాణసఖులార! నాదైన భావ మిపుడు
మీకు దాఁచక తెల్పితి మించె వలపు
చేర నెప్పుడు వచ్చునో! చిత్రరేఖ
తలఁపు లెప్పటికి నీడేర్చు దైవమింక. 67

వ. అని పల్కిన యుషాకన్యకు మాన్యలగు నెచ్చెలు లిట్లనిరి.

క. కలఁగకు నెమ్మదిలోపల
పొలఁతీ! యిందున్నఁ బొద్దు పోవున మనకున్
బొలుపగు శృంగారవనిన్
వలరాయని గొల్త మనిరి వాంఛిత మమరన్. 68

క. ఫణిరాజహార చింతా
మణి కామగవీ సురద్రుమ శ్రీఖండ
క్షణదాధిప శరదభ్ర
ప్రణుతయశస్సాంద్ర! విజయరాఘవచంద్రా! 69

ఉ. శౌరిపదాబ్జసేవనవిచక్షణ! శ్రీరమణీయవీక్షణా!
వైరిజనాధికస్మయనివారణ! సంభృతమత్తవారణా!
సారసలోచనాప్రసవసాయక! సజ్జనభాగ్యదాయకా!
సారయశోవిభూషితదిశాముఖ! వైష్ణవరక్షణోన్ముఖా! 70

క. వారాశిపరితక్ష్మా
ధార! భుజాదండవిమతదళనోద్దండా!
శ్రీరామాయణసంతత
పారాయణ! సరసహృదయ! పండితసదయా! 71

గద్య. ఇది శ్రీరాజగోపాలకరుణాకటాక్షవీక్షణానుక్షణప్రవర్ధమానసార
సారస్వతధురీణయు విచిత్రతరపత్రికాశతలిఖితవాచికార్థావగాహన
ప్రవీణయు తత్ప్రతిపత్రికాశతస్వహస్తలేఖనప్రశస్తకీర్తియు
శృంగారరసతరంగితపదకవిత్వమహనీయమతిస్ఫూర్తియు అతులి
తాష్టభాషాకవితాసర్వంకషమనీషావిశేషశారదయు రాజనీతి
విద్యావిశారదయు విజయరాఘవమహీపాలవిరచితకనకాభిషే
కయు విద్వత్కవిజనస్తవనీయవివేకయు మన్నారుదాసవిలాసనామ
మహాప్రబంధనిబంధనకృతలక్షణయు మహనీయరామాయణ
భాగవతభారతకథాసంగ్రహణవిచక్షణయు పసుపులేటి వెంకటాద్రి
బహుజన్మతపఃఫలంబును మంగమాంబాగర్భశుక్తిముక్తాఫలం
బును రంగద్గుణకదంబయు నగు రంగజమ్మ వచనరచనాచమ
త్కృతిఁ జెన్నుమీఱు ఉషాపరిణయంబను మహాప్రబంధంబునందుఁ
బ్రథమాశ్వాసము.

—: శ్రీ రాజగోపాలాయనమః :—

శ్రీ రాజగోపాలాయనమః

# ఉషా పరిణయము

## (పద్య కావ్యము)

## ద్వితీయాశ్వాసము

—: ఉషాకన్య చెలులతోఁగూడి యుద్యానవనమున విహరించుట :—

వనకేళి — జలకేళి

శ్రీజయనిత్యనివాసా !
భూజనపాలనవదాన్య ! భూజమహోద
గ్రాజిధనంజయ ! దళది
గ్రాజితగుణహారి ! విజయరాఘవశౌరి ! 1

వ. అవధరింపుము.

క. అని పలుకు చెలులపలుకులు
విని కన్నియ సమ్మతింప వెడ్కలు మదిలోఁ
దనరఁగఁ దమతమయుడిగము
లనువొందగఁ జేయఁ బూని రాచెలు లంతన్. 2

సీ. పణఁతి యొక్కతె చేరి బంగారుపావాలుఁ
బదములఁ గీలించె బాగుమీరఁ
జెలియ యొక్కతె చేరి శృంగారమమరంగఁ
గైదండ నొసఁగెను ఘనత మెఱయ

సకియ యొక్కతె చేరి సరిగంచుపనిచీర
  నెఱిఁ జక్కఁగాఁ దిద్దె నీటుగుల్కఁ
గొమ్మ యొక్కతె చేరి కొనగోళ్లచేతను
  గురులు నున్నగ దువ్వెఁ గొమరుమించ

గీ. సతివ యొక్కతె పరిహార్య హారిగఁ బట్టెఁ
  బొలఁతి యొక్కతె యడపంబుఁ బొసఁగఁ బట్టె
  సుదతి యొక్కతె కపురంపుసురఁటి విసరె
  రమణి యొక్కతె వింజామరంబుఁ బూనె. 3

వ. మఱియును.

సీ. దండె తంబుఱ స్వరమండలంబుర బాబు
  వేటుగజ్జలు ముఖవీణె ఢక్క
చెంగు కామాచి యుపాంగంబు కిన్నర
  వీణె తాళంబు(ను) బిల్లఁగోవి
చిటితాళము రమయు శేషనాదంబు రా
  వణ హస్తమును జంద్రవలయములును
మురజంబు నావజంబును మొదలుగఁగల్గు
  కమనీయవాద్యముల్ గరిమెఁ దాల్చి

గీ. రంగురక్తులు గులుకంగ రాజముఖులు
  ముంగలను జేరి త్రిభువనమోహనముగఁ
  జెలఁగి సంగీతమేళంబుఁ జేసి కొలువ
  వేడుకలుమీర నెంతయు విభవమలర. 4

సీ. పదపద్మములచాయ పాఱినయెడలను
  బఱచినచెంగావి బాగుమీర
నెమ్మనికాంతులు నిండినదిశలను
  బంగారుసునుపూఁత రంగుగులుకఁ

కలికిలేఁజూపులు గలిగిన బయిటను
కలువతోరణములచెలువు వెలయ
నెఱికొప్పు బలుకప్పు నిగ్గుదోఁచినచోట్ల
నీలముల్ వెదచల్లు నీటుదనర

గీ. బాణనందనయైనట్టి పద్మగంధి
మందయానలు కొలువంగ నందముగను
మనసు నాథునిపై నిల్పి మచ్చికలర
వన్నెమీరిన యుద్యానవనముఁ జేరె. 5

వ. అప్పుడు.

క. రామా! రమ్మని చెలు లా
రామంబునుఁ జూపఁదలఁచి రమణీయవచ
శ్రీమెరయఁ బలికి రీగతిఁ
గోమలికిని బొద్దుఁబుచ్చు కోరికతోడన్. 6

సీ. పరిమళంబులు నించు పళిఁడికై వడి మించె
సంపెఁగల్ జూచితే సరసిజాక్షి!
పంచబాణునికీర్తి పగిది రాణించెను
బొండుమల్లెలుఁ జూడు పువ్వుఁబోణి!
వనలక్ష్మి మౌక్తికవరహార మన మీరెఁ
బొన్నమొగ్గలుఁ జూడు పుష్పగంధి!
యొప్పారె ధరసేసకొప్పు చందంబున
సేవంతులను జూడు చిగురుఁబోణి!

గీ. మాధవునికొలువుకూటాలమాడ్కిఁ దనరెఁ
గన్నె! చూడుము పుప్పొడిదిన్నె లిచట
యనుచుఁ జెలి నెచ్చరించుచు హర్షమునను
వనవిహారంబునకుఁ బూని వనజముఖులు. 7

౨౭౮. జలజాక్షి ! చూచితే సరవిఁ గనకములిందుఁ
దొలఁగ నళులెల్లను దూరముగ నిటులిందుఁ
జెలియతోఁ బలుమాఱు సేయకుము వాదులను
బాలయాల ! కైకొనుము వేగ విరవాదులను
గలకంఠి ! నేమున్న గైకొంటిఁ జిగురాకు
వలదు నాతో వట్టివాదు ఘనమగు రాకు
కొమ్మ ! యీవిరిబంతిఁ గొనఁగ నాచెలితరమె
తుమ్మెదలు ఝుంకృతులఁ దొలఁగ నదిగో తరమె
సుదతిరో ! వింతాయెఁ జూడు మిట నీడలను
మదనుని హజారములమాడ్కిఁ దగె నీడలను
బొలఁతిరో ! మకరందముల మీరె నిదె పొగడ
చెలరేఁగి పలుమాఱుఁ జెల్లదే యిఁకఁ బొగడ
హరిణాక్షి ! పరికింపు మచటికింశుకములను
మెఱుఁగారు విరుల నామెతసేసె శుకములను
పారిజాతముఁ జూచి పరువెత్తె మున్నయది
మారు నెలగోలిచట మలసి పిక మున్నయది
కంతునకు నర్పింప గమనజితవేదండ
వింతగాఁ గూర్చెదను వేగ యీవే దండ
నలరుగుత్తివి దాని నదట యిమ్మునికేల
కెలననున్నవి విరుల్ గిల్లుమీవె నికేల
నగువారిఁ జూడు మెన్నఁడు గాన మీవింత
చిగురాకునకు రావుసేతురా నీవింత
కోరి నేఁ దెచ్చితిని గోరంటవాసనను
నారి ! నే నటులిత్తు నడిగె దీవాసనను
నదిర ! దవ్వుగఁ బోయి యరికట్టె నిది రాఁగ

నెదురుగా విరిసరుల కింతి యుత్తటి రాఁగ
మల్లెమొగ్గలు మీఱె మరునిశరగోల లన
నెల్లడలఁ దనచాయ లెనయ నిదిగో లలన
బింబోష్ఠి ! యేన తగఁబెంచి తిటు సాలమును
డంబైనయట్టి నీడల నీరసాలమును
నెంతదూరము చనియె నిందు కే యీలేను
కంతుపూజకు నన్నఁ గనకములె యీలేమ
వేడుకలు నించె నిట వెలఁది నారంగములు
నాడగా గుంపులై యలరె సారంగములు
అవుర ! బంగరుచాయ నమరె జంబీరములు
యువతి ! నీకుచము లెనయునె వట్టిబీరములు
గురువెందగుత్తిఁ గైకొను మేల ? జగడంబు
పరికింపు వీనికిని బ్రతియగునె పగడంబు
చాలు నిక ననలనుచు సరసోక్తులను బెనుచు
బాళి మీఱఁగఁ జాల బాణనందనమ్రోల. 8

క. వనకేళి సల్పి యీగతి
నెనసిన తమమేనిబడలికెంతయుఁ దీరన్
దనరెడు తామరకొలనికి
వనజేక్షణఁ దోడుకొనుచు వచ్చిరి వేడ్కన్. 9

సీ. తావులవెదచల్లు తామరవిరి యను
ముద్దులుగుల్కు నెమ్మోముదనర
డాలుఁ గల్గినయట్టి వాలుగమీలను
కడుసోగలై మించుకన్ను లమర
మక్కువగనుపట్టు జక్కవ లనియెడు
కొమరుమీఱిన గబ్బిగుబ్బ లలర
నొమ్ముగాఁ జెలువొందు తుమ్మెదగుంపను
కప్పుమీఱిన గొప్పకొప్పు మెఱయ

గీ. హంసగమనంబులను గతు లతిశయిల్ల
దరఁగ లనియెడు భావాలఁ దనరఁ జూచి
సరసి యనియెడి చెలికత్తె సంభ్రమమున
బాణతనయ నెదుర్కొనె భావమలర. 10

క. ఒకరొకరిచేయి గుచ్చుక
పకపక నవ్వుచును మిగులఁ బంతము మీరన్
వికచాబ్జనయన లయ్యెడ
నకలంకంబైన సరసి నాడుచు వేడ్కన్. 11

సీ. ఈఁత యిక్కడను లేదింతిరో! రమ్మని
చేరంగఁ బిల్చెను జెలియ యొకతె
చిమ్మనగోవులఁ జిమ్మెద వేగమ్మ
యొడ్డించుకొమ్మనె నువిద యొకతె
నేర్పున నీఁదెద నెలఁత! యిచ్చోటను
దను జూడుమని పల్కెఁ దరుణి యొకతె
కలువపువ్వులఁ గోసి కలికి! నీకిచ్చెద
వెన్నంటిరమ్మనె వెలఁది యొకతె

గీ. మాటిమాటికి జాఱుడుఁబీఁట లెక్కి
సారసాక్షులు కొందఱు జాఱి సారె
నొండొరులమీఁద జలములు నిండుకొనఁగ
జల్లులాడిరి సరసిలో సరసముగను. 12

సీ. ఒప్పైనకుచులకు నోడిపోయినయట్లు
తుమ్మెదగుంపులు తొలఁగఁజారె
స్తనయుగ్మములకును సరిరామనెడులీలఁ
జక్రవాకంబులు సరగ నెగసె

గమనంబులకుఁ గుంది కడ నుండుకై వడి
నంచలు పార్శ్వాల నడఁగియుండెఁ
గనుదోయితో సాటిఁ గాంచలేమనురీతి
జలములలోఁ దాఁగె సారె మీలు

గీ. కోమలమీఱు కరేణువుల్ కొలను జొచ్చి
మించువేడుకతో విహరించునట్లు
బాణనందనఁ గూడి యప్పద్మముఖులు
సరసిలోపల జలకేళి సల్పునపుడు. 13

క. ఇవ్విధమున విహరించిన
జవ్వను లందఱును గూడి సంతసమమరన్
బువ్వంబోణినిఁ దోడుక
నవ్వుచు గట్టెక్కివచ్చి నైపుణిమీఱన్. 14

ఉ. బొమ్మలపట్టుకోకలను బొంకముమీఱఁగఁ గట్టి మేలిమా
సొమ్ములు మేనఁ దాల్చి కడుసొంపమరన్ జడలల్లి వింతగా
నెమ్మిని గీఱునామములు నీటుగ దిద్దుచుఁ దీవమేనులన్
గమ్మజవాదివాసనలు ఘుమ్మనిమీఱ నలంది వేడుకన్. 15

—: మన్మథారాధనము :—

క. బటువగు మామిడికిందను
గుటిలాలకమదిని మించుకోర్కెలు వెలయన్
స్ఫుటముగ మదనునిభావముఁ
బటమున లిఖియించి తెచ్చి ప్రమదముమీఱన్. 16

క. పుష్పాడిని దిన్నఁదీర్చుచు
నొప్పుగ మృగనాభి నలికి యొదవిన వేడ్కన్
గప్పురపుముగ్గు లిడుచును
దెప్పలుగాఁ దమ్మివిరులుఁ దెచ్చుచు మఱియున్. 17

సీ. ప్రతిలేని రతనాలపళ్లెంబులోపల
గందంబు కుంకుమ కస్తురియును
బసిఁడియక్షతలను బండ్లు టెంకాయలు
పన్నీరుచెంబులు బాగుమీరు
కపురంపుబాగాలు కలువపూబంతులు
మొగిలిరేకులు మంచి మొల్లవిరులు
కురువేరు దవనంబు గొజ్జంగసరులను
బొండుమల్లెసరాలు పొన్నపువులు

గీ. మొదలుగాఁగల వస్తువుల్ ముదముమీరఁ
దెచ్చి ముందఱ సవరించి తేజమమరఁ
బచ్చవిల్తుని నచ్చటఁ బరఁగ నిలిపి
బాణనందనఁ దోడ్తెచ్చి బాగుమీర. 18

సీ. ధ్యానంబు నారాయణాత్మసంభవునకు
నావాహనంబు రత్యాప్తునకును
సింహాసనంబు రాచిల్కతేజీరౌతు
కర్ఘ్యంబు వారిచరాంకునకును
బువ్వులదుప్పటి పూవింటిజోదుకు
గంధంబు మలయానిలప్రభువునకు
నలరుదండలు కుసుమాకరసఖునకు
ధూపంబు భూరిప్రతాపునకును

గీ. దీప మఖిలానురాగప్రదీపునకును
సరసనై వేద్య మిదె యిక్షుచాపధరున
కనుచు వివిధోపచారము లాచరించి
యయ్యుషాకన్య మొక్కించి యందముగను. 19

సీ. అఖిలజగన్మయుండైనట్టి హరియును
శ్రీసతి నెదనుంచెఁ జెలువముగను
సకలంబు సృజియింపఁజాలిన బ్రహ్మయు
వాణిని నెలకొల్పె వదనసీమ
నతిరౌద్రుఁడై యుండునట్టి ముక్కంటియు
సామేన నుంచెను సతినిఁ బ్రేమ
నల పరాశరమౌనియంతటివాఁడును
మత్స్యగంధినిఁ గూడె మమతచేత

గీ. నితరు లన నెంత నీదాడి కెంచిచూడ
నీకు నెన యెవ్వరయ్య త్రిలోకములను
బాల యెటువలెఁ దాళు ? నీబాణములకు
కన్నెఁ గావుము మదన ! నీ కరుణచేత. 20

వ. అని సన్నుతించి యక్కన్నియచేత మొక్కించిన.

క. కుతుకము మీరఁగ నామదిఁ
జతురతఁ గలఁ గలసినట్టి సరసగుణాఢ్యున్
బతిసేయు మనుచుఁ గోమలి
రతిరాజును వేఁడుకొనియె రంజిలు భక్తిన్. 21

వ. అంత,

—: సూర్యాస్తమయ చంద్రోదయవర్ణనములు :—

క. అరుదగు తనసతినామముఁ
దిరముగ ధరియించునట్టి తెఱవకు నింకన్
బరితాపం బడరాదని
ఖరకరుఁ డస్తాద్రిఁ జేరెఁ గనికర మొప్పన్. 22

మ. కమలంబుల్ ముకుళించె భృంగములఝుంకారంబు ఘోరంబుగాఁ
గుముదశ్రేణులయందు మించె ఖగముల్ గూడుల్ వడిం జేరె సం
తమసంబుల్ దిశలందుఁ బేరెఁ గడువంతన్ గుందెఁ జక్రావళుల్
కమనీయద్యుతిఁ జెందెఁ దారకలు నాకాశంబునం దీరుగన్. 23

సీ. చీఁకటు లవియెడు సింధురశ్రేణులఁ
జెండాడవచ్చిన సింహ మనఁగ
నమరులు సాధియింపఁగల క్షీరవారిధి
వెలువడి కనుపట్టు వెన్న యనఁగఁ
దూర్పుదిక్కనునట్టి తొయ్యలి ధరియించు
మురువైన ముంగరముత్తె మనఁగ
వెలిదీవిలోనున్న వెన్నునిసన్నిధిఁ
బట్టిన బలుపగల్వత్తి యనఁగ

గీ. వెలయఁగఁ జకోరములకెల్ల విందుఁ జేసి
కువలయామోద మొనరించి కొమరుమీరఁ
గూడియుండెడి విటులకుఁ గోర్కె హెచ్చఁ
జంద్రుఁ డుదయించె సత్కాంతిసాంద్రుఁ డగుచు. 24

వ. అట్టి సమయంబున,

—: మన్మథుఁడు ఉషపై దాడివెడలుట, మాన్మథవికారవర్ణన :—

క. బల్లిదుఁడై మొల నరవిరి
చల్లడముఁ జివురుదట్టి సవరించి తగన్
మల్లెవిరిబొమిడికం బిడి
మొల్లజిరాఁ దొడిగి మిగుల మోదముతోడన్. 25

సీ. చెలరేఁగి మెలఁదేఁటియెలగోలుమూఁకలు
దులదుల మునుమున్ను దుముకు లిడఁగ
దండిమై రాయంచదండి బారానెంట
మెండుగా నల్లడ నిండి నడవ
నిరువంకలను జేరి గోరంకమన్నీలు
బలుబింకములతోడఁ బ్రబలి కొలువ
గుంపుగూడుక గండుగోయిల మాస్టీలు
వెన్నానికై మదోద్వృత్తి కాఁగఁ

గీ. జిఱుతతెమ్మెర దళవాయి సరసఁ జెలఁగఁ
దేజ మమరంగ రాచిల్క తేజి నెక్కి
తమ్మిదొరదుమ్ముఁ గలువకేడెమ్ముఁ బూని
తలిరువిలుకాఁడు బోటిపై దాడివెడలె. 26

ఉ. పాయనిభీతిఁ బాంథులకు ఢగ్గున గుండెలు బెగ్గడిల్లఁగాఁ
గోయిల లంటి వెంట జని కోయని యార్వఁగ డంటతుంటవిల్
రాయలు తుమ్మికై దువ ఝురాయన దూయుచు దొమ్మి కొమ్మపై
ధేయని కల్కి రాచిలుక తేజిని నూఁకె మవాళి మొప్పఁగన్. 27

క. ఆయెడ వలరాయఁడు బలు
రాయిడి కెందమ్మి జిగికరాచూఱులచే
నాయమ్ములు గాయమ్ములు
సేయన్ వదిరాఁడి బెగడెఁ జిత్తములోనన్. 28

క. కలఁ గలసిన యాలచెలువుని
తలువముఁ దమి నెంచ నెంచఁ జిత్తములోనన్
వెలివిసరె సత్త్వసంభవ
లలితవికారంబు లవుడు లజ్జావతికిన్. 29

చ. సరసిజపత్రనేత్ర కలచందము డెందములోనఁ బూని ప
ల్మరు మరుచూలియేలినక్రమంబు గణించ మరుందు నించఁగా
గరులకుఁ గాఁడి వాఁడి సరికట్టిన కల్వలకోరిచాలు మే
ల్మురువున రూపుమైపులకముల్ మెఱసెన్ మొగసెన్ ద్విరేఫముల్.

చ. సలలితమైన చందనముచాయను మాయఁగఁ జేసి కప్రపుం
బలుకుల తళ్కుపూఁత నగుఁ జాటొనరింపుచు గబ్బిగుబ్బలన్
నెలకొను సిబ్బెపున్ మెఱుఁగుసీటును మాటు ననంగపాండిమం
బలవడె నింతిమేనఁ గుసుమాయుధకీర్తిసమానమూర్తియై. 31

సీ. మించుమొగ్గలను రాణించు తీవియ నీస
డించు చెల్వంబు వరించ నెంచి
డంబుము త్తెపుచెక్కడంబుడాల్ మరునిబె
త్తంబు నేల్ మెఱుఁగుమొత్తంబుఁ దాల్చి
యొసపరిమించు చే నెసఁగు తొల్కరివిప్పుఁ
బసిఁడి గేదఁగిరేకుమిసమిఁ దెగడి
చిలుపసీలును బొందు నిలుపఁ బోలు మెఱుంగు
మలపఁ జాలు తెఱంగుఁ దెలుపమీరి

గీ. మెఱయు చిఱుచెమట నీన మేన చాన
యుల్లసిలువల్లభుని నెద నుండునట్లు
డాలువాలుగ దొర పూలకోలలేటు
నాటి సాత్త్వికభావంబు తేటవఱప. 33

గీ. వనజముఖి యూర! యబలయయ్యును జగత్ప్ర
సిద్ధు ననిరుద్ధుఁ దనలో నిరుద్ధుఁ జేయు
బద్ధవైరంబు మరున కాభ్రమరకచకు
దానిచే నయ్యె సుతునకై పూనుకొనరె! 33

చ. కనుఁదెఱఁగొప్పియున్ గనదు గాంచు గణించఁగఁ బారవశ్యమున్
వినుతికి నెక్కు నామధురవృత్తి వహించియు మాటలాడదా
మునుకొని యెట్టివారలకు మోహమొకర్చును గాఁక కిమ్మగున్
గనుఁగొన భేద మాకలువకంటికి మారునితుంటవింటికిన్. 34

క. కలకల నవ్వుచునుండున్
బలుమాఱును దిశలుఁ జూచు భ్రమయుచునుండున్
నిలిచినచోటను నిలువదు
కలకంటికి విరహమెంత ఘనమో! యకటా! 35

—: ఉషాకన్యకు చెలులు శైత్యోపచారములఁ జేయుట :—

వ. ఇవ్విధంబున.

క. మరుకాఁకల భ్రమనొందుచుఁ
బరువడి నసురసురుమనుచు భామిని మదిలో
వరునిన్ దలఁపుచు నుండఁగ
వెరగందుచు నొక్కసకియ వెలఁదుల కనియెన్. 36

సీ. అతివ! దాఁగిలిముచ్చులాట లాడుద మన్న
సమ్మతించ దొకింతఁ జంద్రవదన
చెండుగోరింతము చెలియ! రమ్మని పిల్వఁ
గనువిచ్చి చూడదు కలువకంటి

గుజగుజతేకుల కొమ్మ ! యాడుద మన్న
    మోమెత్తి చూడదు ముద్దుగుమ్మ
పగడసాల మనము పడఁతి ! యాడుద మన్నఁ
    బలుకదు మనతోను బద్మనయన

గీ. యతివ ! చదరంగ మాడుద మనుచుఁ బిల్వ
నించుకైన నంగీకరించదయ్యె
ననినఁ దమలోన వగచుచు నతివఁ జేరి
మరునితాపంబుఁ జల్లార్చుమననుతోడ. 87

సీ. బాణనందన కష్ట పణఁతు లందఱుఁ గూడి
    శైత్యోపచారముల్ సలుపఁగోరి
చిగురాకుపాన్పుపైఁ జెలియ నొయ్యన నుంచి
    పూలదుప్పటి మేనఁ బొసఁగఁ గప్పి
కపురంపువాసనల్ ఘుమ్మన వాసించు
    చలువగందముఁ బూసి చెలువుమెఱయఁ
బన్నీటఁ దడసిన పావడచేతను
    మొగమునఁ దడియొత్తి మోదమమరఁ

గీ. కలువపూవులబంతులఁ గన్నుదోయి
మాటిమాటికి నొత్తుచు మమతమీరఁ
బూలసురఁటుల విసరుచుఁ బొంకముగను
మరునితాపంబుఁ జల్లార్ప మగువకపుడు. 88

సీ. చెలువుమీరినయట్టి చిగురాకుపానుపు
    చిగురువిల్తుని వాఁడిచిలుకులయ్యెఁ
బొసఁగంగఁ గప్పిన పువ్వులదుప్పటి
    పంచబాణుని బాణపంక్తులయ్యెఁ

గన్నుల హత్తించు కలువపువ్వులబంతి
వలరాజు మొలనున్న వంకి యయ్యెఁ
దనువున నించిన తామరతూఁడులు
కుసుమసాయకు నీలకొట్టులయ్యెఁ

గీ. జెలులు గావించు నుపచారములె తలంప
మనసిజుని సాధనంబులై మనసులోనఁ
దోఁచుచుండంగ విరహంబుఁ దోయలేక
నేమిసేయుదు? నెట్లోర్తు? నేనటంచు. 39

—: ఉషాకన్యయొక్క మాన్మథప్రలాపములు :—

క. కలఁగుచు నుండెడు వేళను
గలలోపలఁ గలసినట్టి కాంతుండెదుటన్
నిలిచిన యటువలెఁ దోఁపఁగ
బలుమఱు నెచ్చెలులతోడ భ్రమయుచుఁ బలికెన్. 40

సీ. అంతఃపురంబున కళుకక వచ్చిన
దిట్టను జూడరే చెలువలార!
తనమానధనమెల్ల మును గైకొనినయట్టి
చోరునిఁ జూడరే సుదతులార!
పలుమాఱు మోవాని పలుగంటిజేసిన
జాటును జూడరే బోటులార!
చెక్కిలిఁ గొనగోర జీరలుజేసిన
యాధూర్తుఁ జూడరే యింతులార!

గీ. తొడలపైనుంచి పుక్కిటివిడె మొసంగి
కళల సొక్కించి మిక్కిలి గారవించి
కంతుకేళిని ననుఁగూడు రంతుకాఁడు
యెదుట నున్నాఁడు జూడరే ముదితలార! 41

సీ. జూటుకాఁడగు వీఁడు జాఱఁగిపోవక యుండఁ
దోయజాక్షిరో ! తల్పు మూయవమ్మ
కన్నగాఁడగు వీఁడు కదలిపోవక యుండఁ
బడఁతి ! సందిటఁగుచ్చి పట్టవమ్మ
వంచకుండగు వీఁడు వదలిపోవక యుండఁ
జంచలేక్షణ ! యడ్డగించవమ్మ
దిట్టయై తగు వీఁడు తేలిపోవక యుండ
నతివ ! పేరేమని యడుగవమ్మ

గీ. సారిది నల పోతుటీఁగకుఁ జొరఁగరాని
యిచ్చటికి నేటి కీవేళ వచ్చితనుచు
మంచిమాటలచే వీనిమనసు తలఁపుఁ
గలువకంటిరో ! తేటగాఁ దెలియవమ్మ. 42

వ. అని మఱియు నిట్లనియె.

సీ. కన్నెపాయముదానఁ గదిసి నామోవిని
బలుగంటిసేతురా ! భయము లేక
యాటపాయముదాన నగడుగాఁ జన్నులఁ
గొనగోరులుంతురా ! కొంకు లేక
ముద్దరాలను నేను ముద్దుచెక్కిలి నొక్కి
జీరలు సేతురా ! చింత లేక
గోలను గాఁగిట గుచ్చి నీసరిపెన
గురుతులు నింతురా ! సరకు లేక

గీ. బాలికామణినైన నాపాన్పుఁ జేరి
పచ్చవిల్తుని కేళిని ముచ్చువగల
వేగుదనుకను ననుఁగూడి వింతగాఁగ
గాసిసేతురే ! నీవింత కరుణలేక. 43

సీ. పుక్కిటివిడె మిచ్చి బుజ్జగించిన నీకు
మోవియ్యనైతినా మోహనాంగ!
కదిసి ప్రేమను నన్ను కౌఁగలించిన నిన్ను
గుబ్బల నొత్తనా కోడెకాఁడ!
చెక్కిలి నొక్కినఁ జెలరేఁగి సందిట
నెలవంక లుంచనా నీటుకాఁడ!
సమరతులను నన్ను సారె నీవలయించ
నుపరతి సేయనా వోరి జాణ!

గీ. నేరమేమిర? నామీఁదఁ జేరి యింత
తామసించిన నేనింత తాళఁగలనె
కౌఁగిలియ్యర నాసామి! కరుణమీర
భావజున కొప్పగింతురా! ప్రాణనాథ! 44

సీ. అల చకోరము వెన్నెలతివ కిచ్చినయట్లు
మోవి యొసంగరా మోహనాంగ!
చెలువతోఁ గోకిల చెలఁగి పల్కినయట్లు
మాటాడరా వేగ నీటుకాఁడ!
హంస తామరతూఁడు సబల కిచ్చినరీతి
మణుపులు గొటికీర మన్నెరాయ!
జక్కవ వెంటితో జతఁగూడి నటువలె
రతి నేలరా నన్ను రంతుకాఁడ!

గీ. వనయు వాసనయును గూడి తనరినట్టు
లొప్పుమీరిన యీచల్వచప్పరమున
నమరు చౌసీతివగలచే వనఁగి పెనఁగి
కోర్కె లీడేర్చరా నేడు కోడెకాఁడ! 45

సీ. పొలఁతి యెవ్వతె చేరి బుద్ధులు చెప్పెనో!
        పలుమాఱు నేఁ బిల్వ బలుక వేమి?
పూఁబోణి యెవ్వతె బోధించెరా నీకు
        ప్రేమఁ గౌఁగిటఁ జేర్చి పెనఁగ వేమి!
లేమ యెవ్వతె దయ లేకుండఁ జేసెనో!
        తియ్యని కెమ్మోవి నియ్య వేమి?
చెలియ యెవ్వతె నీదు చిత్తంబుఁ గలఁచెనో!
        చెక్కిలిఁ బ్రేమతో నొక్క వేమి?

గీ. యెవ్వతె మరులుఁ బుట్టించె నెసఁగ నీకు
నెయ్యమమరంగ నను జేరఁదీయ వేమి?
భావజాకార! నీదైన భావ మేమి?
తెలియఁబల్కర నీవింకఁ దేటగాఁగ. 46

—: ఉష మదనుని మదనబలముల నిందించుట :—

సీ. ప్రేమతోఁ జక్కెరఁ బెట్టి లాలించిన
        చిలుకలే పగటుగాఁ బలుకసాగె
నాయెలదోఁటలోననె వృద్ధిబొందిన
        యళులె ఝుంకృతుల నన్నళుకసేసె
నటనగుల్కంగ నేనడపించు నంచలే
        ప్రతికూలగతులయ్యె భావమునకుఁ
బూఁటబూఁటకు నీళ్లుఁ బోసి పోషించిన
        లతికలే మరునమ్ములపొదు లయ్యెఁ

గీ. పాములకుఁ బాలు బోసినపగిది వీటి
నెంత పెంచినఁ గనికర మింతలేక
పంత మలరంగ నేఁ డల పంచబాణుఁ
గూడి యాఱార! నామీఁద దాడివచ్చె. 47

వ. అని యాదనుజరాజపుత్త్రి వనజవైరిం జూచి యిట్లనియె.

క. క్షీరాంబుధి జనియింపుచు
శ్రీరమణికి నన్న వగుచు జెలఁగిన నీకుం
గ్రూరమగు సెకలు జల్లుట
నారుద్రునిశిరసుఁ జేరు నావగను సుమీ! 48

వ. అని పల్కిన యనంతరంబ యాబాణపుత్త్రి పంచబాణు నుద్దేశించి.

క. చలికరువలి నెచ్చెలివై
యెలమిం హరితనయుఁ డనఁగ నిల నెగడిన యో
కలువలచెలి మేనల్లుఁడ!
చెలువల నిటులెంచ నీకుఁ జెల్లునె మదనా! 49

గీ. బాణునకు నోడి చనిన గీర్వాణులెల్ల
మకరకేతన! నిను వేఁడ మచ్చరించి
చెలఁగి నామీఁద దాడివచ్చిన విధంబె
తెలిసె లేకున్న నీకింత ద్వేషమేల? 50

క. అని మదను మదనబలముల
మనమున నిందించి మగువ మాటికి దూఱన్
విని నెచ్చెలు లందఱు నా
దనుజాధిపపుత్త్రిఁ జూచి తగ నని రెలమిన్. 51

క. అల చిత్రరేఖ మనలోఁ
దెలిపిన యటువంటి సప్తదినములు గడచెన్
దెలతెలవాఱఁగవచ్చెన్
గలఁగకు మిదె పటముఁ దెచ్చుఁ గమలదళాక్షీ! 52

—: సూర్యోదయవర్ణనము :—

వ. అని నెచ్చెలు లచ్చెలువ నూఱడించు సమయంబున.

చ. పలుమఱు గాఁక నింపుచును బాణతనూభవ నింత యేఁచఁగా
బలితనయుండు వేగ తనపై నిఁక నెక్కడ దాడివచ్చునో!
చలమున నంచు వెల్లనగు చందురుచందముఁ జూచి మాటికిన్
వెలయఁగ నవ్వినట్టు లరవిందములున్ వికసించె నత్తరిన్. 53

చ. ఎనయఁగ నాయెడన్ దిరిగి యీదనుజుల్ భయపెట్టులోకముల్
మనుమని త్రోవఁగా దనుజమర్దనుఁ డీకు వచ్చి నిచ్చలున్
దనుజులకిమ్ము సంగితని దండనసేయునో యంచు జాతెనా
చనియెను రాత్రి యంతటనుజక్కనసూరుఁడు దోఁచెఁ దూర్పునన్.

చ. పురమున సాయకాసురుఁడు భూరిబలంబున లెక్కసేయకే
హరివరశౌర్యుఁడై యలరు నయ్యనిరుద్ధుని నడ్డగించినన్
దురుసగు వేయిబాహువులుఁ ద్రుంచు మటంచును బంప వచ్చునా
హరికరచక్రమో యనఁగ నంబుజమిత్రుఁడు తోఁచె నంతటన్.

—: ఉష చిత్రరేఖరాకకై యెదురుచూచుట, చిత్రరేఖ పటముల వ్రాసి తెచ్చుట :—

వ. ఇట్లు సూర్యోదయంబైన యనంతరంబ యాయుషాకన్యయు నొప్పుమీరు నొక్కచలువచప్పరంబందుఁ గప్పురపుగంధులుఁ దాను గొలువై యుండి చిత్రరేఖరాక కెదురుచూచుచు నెచ్చెలులతోడ నిట్లనియె.

సీ. అల విభునామంబు నన్వయక్రమమును
నెన్నఁడు నే విన నిందువదన!
వానివయోరూపవరవైభవంబులుఁ
జూడ నెన్నడు నేను శోభనాంగి!

తలఁపున నొకనాఁడు తలఁచని ప్రియుఁడేల!
కలలోన వచ్చెనే కంబుకంఠి!
కలఁగన్నవారికిఁ గాఁకలు రెట్టింప
వలపులు బుట్టునా వెన్నెలాఁడి!

గీ. యిట్టివిరహాంబునిధి దాఁట నేది తేప?
చిత్రరేఖయు రాదాయెఁ జెలిమిమీఱ
నేమిసేయుదు దాఁపెవ్వరింకఁ దనకు?
నిమిష మేఁడయి తోఁచెను నీరజాక్షి! 56

వ. అని యుషాకన్య పారంబులేని విరహాభారంబున నచ్చెలులతోడ ముచ్చటలాడుచు నుండె, నంతకుమున్న యక్కడ.

సీ. రాణించు లత్తుకరసమును సంకును
హాళఁది కాటుక పచ్చయాదియైన
వన్నియలను బైఁడిగిన్నియలను నించి
బాగుగా ఘటియించు పటమునందు
సొరిది బంతులుగాఁగ సూత్రముల్ హవణించి
జోకగాఁ గప్పున రేకఁదీర్చి
యమర నయ్యయ్యెడలందు వన్నెలు నించి
యమరదైత్యాదిభావములు వెలయ

గీ. వారివారికి నగునలంకారములను
వారివారికిఁ దగునట్టి వస్త్రనాల్యా
ములును గనుపట్టునట్లు నేర్పున లిఖించెఁ
జిత్రతరరేఖయైన యాచిత్రరేఖ. 57

వ. ఇవ్విధంబున.

సీ. ఆసఖీమణి సప్తవాసరములలోన
నట్లన గీర్వాణయక్షచరుల
దనుజముఖ్యులను గంధర్వకిన్నరులను
మహినిఁ బ్రసిద్ధులౌ మనుజపతుల
భావంబుమీర గొప్పపటంబునను వ్రాసి
యాపటంబును గొంచు నతిజవమున
నెప్పుడెప్పుడటంచు నెదురుచూచుచు మదిఁ
గలఁగుచుండెడు నుషాకన్యఁ జేర

గీ. తాను దెచ్చినపటము ముందఱను నిల్పి
కన్నె! కను మిప్పటంబున నున్నవారి
వన్నెమీఱు సురాసురకిన్నరోర
గప్రముఖులైన సౌందర్యఖనుల ఘనుల. 58

క. వీరల నందఱఁ గనుఁగొని
కోరికలను నిన్ను బ్రేమఁ గూడిన పురుషున్
నీరజముఖ! యెఱిఁగించినఁ
జేరువకున్ దోడితెత్తుఁ జెలువుగ నతనిన్. 59

—: చిత్రరేఖ చిత్రపటములందలి నాయకుల వర్ణించుట :—

వ. అని పలికి తదనంతరంబ చిత్రరేఖ యిట్లని వివరింపఁ దొణంగె.

సీ. పరికింపు కృతనేత్రపర్వులై వెలయు సు
పర్వులు వీర లోపద్మగంధి!
తమిఁ జూడు రుచిరగాంధర్వులై చెలఁగు గం
ధర్వులు వీర లోతలిరుఁబోఁణి!

వీక్షింపు సురలోకరక్షణదక్షులౌ
యక్షులు వీర లోయలరుఁబోణి!
కనుఁగొను మహితభంజనసద్విచారణల్
చారణుల్ వీర లోసరసిజాక్షి!

గీ. పన్నగేంద్రులు వీర లోపక్ష్మలాక్షి!
కిన్నరులు వీర లోరాజకీరవాణి!
సిద్ధవరులు వీరలు మణిస్నిగ్ధవేణి!
సాధ్యవర్యులు వీర లోసన్నుతాంగి! 60

వ. అని మఱియును.

సీ. అద్రిసముత్తుంగభద్రవారణసము
న్నిద్రసైన్యుఁ డితఁడు మద్రవిభుఁడు
బాలామనోహరనాళీకశరరూప
లాలితుండితఁడు పాంచాలవిభుఁడు
ధాటీసముద్భూతఘోటీకృతారాతి
పాటనుండితఁడు కర్ణాటవిభుఁడు
దారుణపరవీరదారణకరవాల
ధారేయుఁ డితఁడు సౌవీరవిభుఁడు

గీ. భోటకాంభోజమగధభూభుజులు వీర
లంగవంగకళింగనాయకులు వీరు
చోళనేపాళకేరళమాళవాది
రాజకులముఖ్యనృపులు వీరలు మృగాక్షి! 61

గీ. పుణ్యవంతుఁడు మిగుల దాక్షిణ్యశాలి
సత్యవాది శుభావహస్తుత్యకీర్తి
రాజకులభూషణుండు ధర్మజుఁ డితండు
సారసోదరసోదరచారుగాత్రి! 62

క. భూరిబలరూపవిద్యా
ధారేయుఁడు భీమనిజగదాత్రాసితగాం
ధారేయుఁ డితఁడు భీముఁడు
దారయశోధనుఁడు వికచతామరసాక్షీ ! 63

క. గాండీవధరుఁడు సద్గుణ
మండితదిఙ్మండలుండు మత్తారిశిరః
ఖండనపండితుఁ డితఁ డా
ఖండలసుతుఁ డర్జునుండు కమలదళాక్షీ ! 64

గీ. ఆశ్వినేయకుమారుల నధికయశుల
నంగనాజనమోహనానంగసముల
నఖిలభువనప్రసిద్ధుల నమితబలుల
నకులసహదేవులను జూడు నళిననేత్రి ! 65

సీ. సకలసంపదలచే జగతిలో వెలసిన
రాజరాజీతఁడో రాజవదన !
కార్యఖడ్గంబుల గరిమఁగాంచినయట్టి
యువరాజితండు నీలోత్పలాక్షీ !
దానకీర్తులచేత ధరలోన నెగడిన
కర్ణుఁ డీతఁడు సుమ్ము కంబుకంఠి !
సకలమాయోపాయచాతుర్యమున మించు
శకుని యీతఁడు సుమ్ము చారుగాత్రి !

గీ. సింధుకోసలజాంగలసింహసాళ్వ
గౌడకాశ్మీరలాటకేకయవిదర్భ
కుంతికుంతలసౌరాష్ట్రకుకురనిషధ
నాయకులు వీరె లోలహరిణాయతాక్షి ! 66

క. హాలాసేవనసంతత
హేలాలహరీవిహారి హీరహిమానీ
[1]హేలాకరసితగాత్రుఁడు
నీలాంబరుఁ డితఁడు నీలనీరదచికురా ! 67

సీ. కరుణారసోత్తుంగశరణాయితాపాంగ
వీక్షణుం డఖిలైకరక్షణుండు
శరణాగతత్రాణకరణాదరధురీణ
చరణాంబుజుండు శ్రీకరభుజుండు
తరుణారుణకిరీటభరణాత్తరుచికూట
భాసురుండు పరాజితాసురుండు
[2]తరుణార్తజనతాపహరణాదరదురాప
కీర్తనుండు శుభప్రవర్తనుండు

గీ. పావనుండు భయార్తద్విపావనుండు
మాధవుండు బుధారామమాధవుండు
శ్రీధరుండు నవాంబుదశ్రీధరుండు
రాజగోపాలుఁ డితఁ డో రాజవదన ! 68

సీ. హృదయలక్ష్యవిభేదిమృదుసురభిళబాణు
నారీమనోహరణప్రవీణుఁ
బాకారినీలప్రపంచవంచకవర్ణు
లలితకళాజాలలబ్ధవర్ణు
నిక్షుకోదండోపలక్షితనిజబాహుఁ
జారువల్గనరాజకీరవాహు
శుకపికశారికానికురుంబపరివారు
నంబుధివరతనయాకుమారు

1. లాలకర. 2. తరుణార.

గీ. సురభిసారథ్యశోభితసురభిపవన
రథనియోజితమకరవరధ్వజాగ్ర
విధుతివేపితవిభ్రాంతవిరహిజాతుఁ
జిత్తజాతు విలోకించు చిగురుఁబోణి! 69

—: ఉష కలలోఁగలసిన కాంతుని గనుఁగొనుట :—

వ. అనుచు వారివారి కులగుణస్థానపౌరుషంబులఁ దెలియఁబలుకుచుఁ జూపుతరి నయ్యుషాకన్యక సావధానంబుగా వినుచుఁ గ్రమంబున నవలోకింపుచు వచ్చివచ్చి తదనంతరంబ నిజమనోనయనానందకరుండై ప్రకాశించు ననిరుద్ధు నభివీక్షించి సముత్ఫుల్లలోచనాంబుజయై విచిత్రతరనిజచిత్రరేఖయగు చిత్రరేఖం గనుంగొని.

క. ఈతనికులమును గుణము స
మాతతనిజబాహువిక్రమక్రమమును నీ
చాతుర్యమమరఁ బల్కుచుఁ
జేతోమోదంబుఁ గలుగఁజేయుము చెలియా! 70

వ. అనినఁ జిత్రరేఖ యిట్లనియె.

సీ. ఏదేవుఁ డఖిలాసురేశ్వరస్తవనీయ
మహనీయపాదాబ్జమహిమశాలి
యేదేవుఁ డవినీతహృదయభూరినిశాట
పటలభేదనబాహుపటిమశాలి
యేదేవుఁ డుజ్వలహేమాచలోత్తుంగ
శృంగశృంగారకిరీటశాలి
యేదేవుఁ డబ్జసుహృత్కోటిభాస్వర
తుదనిజదేహవిహారిశాలి

గీ. యట్టిశౌరికి మనుమండుదారబలుఁడు
పంచబాణాత్మభవుఁడు శోభనగుణప్ర
[1]సిద్ధుఁ డతివిక్రమకళాసమృద్ధుఁ డీతఁ
డవని ననిరుద్ధుఁ డనఁ గడు నతిశయిల్లు. 71

—: ఉష యనిరుద్ధుని దోడితెమ్మని చిత్రరేఖను వేఁడుట :—

వ. అనినఁ జిత్రరేఖకు నుషాకన్య యిట్లనియె.

క. మానిని! యీతఁడు నా
మానధనముఁ గొల్లలాడి మక్కువమీఱం
గా ననుఁ గూడిన ప్రియుఁ డను
మాన మొకింతయును లేదు మది నూహింపన్. 72

ఆ.వె. అనుచు దనుజపుత్రి యాచిత్రరేఖతో
మనముఁ దెలియఁబల్కి మఱియు ననియెఁ
జెలియ! యింకఁ దామసించిన నెటుఁగోర్తు
వేగ తోడితెమ్ము విభుని నిటకు. 73

వ. అనినఁ జిత్రరేఖ చిఱునవ్వుతో నయ్యుషాకన్యఁ జూచి యిట్లనియె.

ఉ. ఎవ్వరు? మెత్తు రీపలుకు లేణవిలోచన! చూడ నెంతయున్
దవ్వుల దుర్గమంబయిన తావున నుండెడువాని నొక్కనిన్
బువ్వులవిల్తుకేళిఁ గల మోదముమీరఁగఁ గూడి యాక్రియన్
నెవ్వగఁ జెంది యాపురుషు నీవిటఁ దెమ్మనిపల్కఁ దొప్పగన్. 74

వ. అని మఱియును.

1. సిద్ధుఁ డతివిక్రమకళాసమృద్ధుఁ డీతఁడ
వని ననిరుద్ధుఁ డనఁగ గడు నతిశయిల్లు

సీ. అనిరుద్ధు నిటకుఁ దోడ్కొనివచ్చు టదియెంత
సులభంబుగాఁగను బలికెదమ్మ!
వనజాక్షి! యిటకుఁ బదినొకండువేల యో
జనములదవ్వెట్లు చనుదునమ్మ?
చని ద్వారకను జేరినను రక్షిజను లుండ
నంతిపురంబెట్లు గాంతునమ్మ?
కాంచిన నచ్చటికామినుల్ గన నెట్లు?
నీవిభుచెంగట నిలుతునమ్మ!

గీ. యింతయత్నంబు సేసి నే నిచటి కతనిఁ
దెచ్చినను బాణుఁ డెఱిఁగిన మచ్చరించు
శౌరి శోణితపురమును జేరవచ్చు
నతని గెల్వ నెవ్వరికి శక్యంబుగాదు. 75

గీ. అట్లుగావున నన్ను నిన్నసురవిభుని
నీవు రక్షింపఁ దలఁచిన నిట్టితలఁపుఁ
జెలియ! యిప్పుడు నాతోడఁ జెప్పవలదు
సాహ(సము)సేయఁ బాడియే చంద్రవదన! 76

వ. అనిన దానవకన్య వియోగజనితవేదానానితాంతదోదూయమానమానసయై, కనురెప్పలం జిప్పిలు బాష్పకణంబు లనఘంబుల నెగఁజిమ్ముచు దిట్టతనంబు వీడి యగ్గలంబుగ నిట్టూర్పువుచ్చుచు డగ్గుత్తికతోఁ జిత్రరేఖంజూచి యిట్లనియె.

క. మనమలరఁగ నీవల్లభు
వనితా! తోడ్కొనుచువత్తు వగవకు మని ప
ల్కిన నీవె మగుడ నివు డి
ట్లని పలికితి వింక నేమి? యనఁ గలదు చెలీ! 77

వ. అని మఱియును.

ఉ. పున్నమనాఁటిచందురునిఁ బోలిన నాథుని నెమ్మొగంబు హా
ళ్లోన్నతిఁ జూచికాని సరసోక్తులుఁ బల్కుచు వానిఁ గౌఁగిటం
జెన్ను వహించికాని బహుచిత్రగతిన్ గుసుమాస్త్రకేళిక
మన్ననఁ గాంచికాని యిఁక మానిని ! ప్రాణము నిల్పనేర్తునే. 78

గీ. వేయిమాటలు నింకేల వెలఁది ! నీవు
కావలె నటన్నఁ గార్యంబు కాకపోదు
నాదుప్రాణంబు నిలుపుచందంబయేని
ప్రాణవిభుఁ దోడి తెమ్ము శీఘ్రంబుగాఁగ. 79

—: చిత్రరేఖ యనిరుద్ధుని దెచ్చుటకై ద్వారకాపురి కేఁగుట :—

వ. అనినఁ జిత్రరేఖ నితాంతస్నేహాయత్తచిత్తయై యుత్తరలాక్షిం
గనుంగొని.

సీ. ఘనమైనకార్యంబుగావున నీమనం
బరయుటకై యిటు లంటినమ్మ !
యెంతదవ్వైనను నేమి నేఁ గావలె
నన నిమిషంబునఁ జనఁగలేన
యెట్టికార్యంబైన నేనుండఁగా నీకు
సరసీరుహాక్షి ! విచారమేల ?
క్షణములో నిదె ద్వారకాపురంబును జేరి
యనిరుద్ధుఁ దెచ్చెద నతిజవమున

గీ. ననుచు నయ్యుషాకన్యను హర్షజలధి
నోలలాడించి నిజకళాలీలమెఱయ
నితరు లెఱుఁగకయుండ నదృశ్యయగుచు
గగనమార్గంబుఁ జెంది శీఘ్రమునఁ జనియె. 80

వ. ఇట్లు చనిచని,

సీ. శ్రీకరగోపురప్రాకారరుచిరంబు
బహురత్నమయహర్మ్యభాసురంబు
కేతనదివ్యనికేతననికరంబు
నారీరూపప్రమదాకరంబు
భూరితురంగమవారణప్రకరంబు
భవ్యతూర్యనినాదభాస్వరంబు
సమరసముద్భటసద్భటవిసరంబు
సురుచిరాలంకారసుందరంబు

గీ. చారునిజపరిఘాయితసాగరంబు
మహితసంపత్పరాజితామరపురంబు
నూత్నమణిగణధారణీనూపురంబు
కాంచె నాచంద్రముఖి ద్వారకాపురంబు. 81

వ. ఇట్లు గాంచి యనిరుద్ధుం దోడ్కొనిపోవునదియై తదీయభవన సమీపంబున నూత్నప్రాకారంబున నిలిచి తాను కైతవంబునఁ బ్రద్యుమ్నసూనుఁ దోడ్కొని చనిన వనజలోచనుఁడు కోపించి తన్ను శపించు ననుతలంపున నొక్కింతఁ జింతింపుచుఁ దత్ప్రాంతంబున,

-: చిత్రరేఖ నారదమునీంద్రుని గాంచి యతనికి సకలవృత్తాంతముల నెఱింగించి తదనుమతిని బడయుట :—

క. అరవిందముకుళవిగళ
ద్ద్విరేఫఝుంకృతివినిద్రవిహగోత్కరముల్
పరిసరవిసృమరకేసర
పరిఫుల్లేందీవరమును బద్మాకరమున్. 82

వ. కని తత్తటాకమధ్యంబునందు.

శా. ఫుల్లాంభోరుహమిత్రు సుస్మితముఖాంభోజాతు నిందీవరో
ద్యల్లీలాకరగాత్రుఁ గౌస్తుభలసద్వక్షున్ సువర్ణాంబరున్
ముల్లోకంబులు నేలు నా హరి హృదంభోజంబునన్ భక్తిసం
ధిల్లన్ ధ్యానముసేయు నారదముని న్వీక్షించి హర్షంబునన్. 83

వ. చేరవచ్చి తదీయచరణసరసీరుహయుగళంబు సేవించి వినయావనతవదనయై కరంబులు మొగిచి యున్న యయ్యంగనం గనుంగొని సకలతత్త్వకలనవిశారదుండగు నారదుం డాశీర్వదించి యో భామిని! నీవిటకు వచ్చిన కార్యం బేమని యడిగిన నయ్యింతి సంతసంబున నతని విలోకించి యోమునీంద్రా! శోణితపురాధీశ్వరుండైన బాణాసురునిపుత్రి యుషాకన్య కాత్యాయనీవర ప్రభావంబున ననిరుద్ధు(నియందు) నత్యంతానురక్తయై యయ్యనిరుద్ధుఁ దనవద్దికిం దోడితెమ్మనిన నప్పనిఁబూని యిచ్చటికి వచ్చితి నట్లన యనిరుద్ధుం దోడ్కొని యరిగెద,నికార్యంబు శ్రీకృష్ణుండు విని తనపయిఁ గోపించకుండునట్లుగాఁ గటాక్షింపు, మదియునుం గాక బాణుండు బాహుగర్వంబునం జేసి యనవరతంబు సంగరంబుఁ గోరుచున్నవాఁడు గావునఁ గన్యాంతఃపురంబున నున్న యనిరుద్ధు నెఱింగి యవశ్యంబు యుద్ధసన్నద్ధుండై యతనిం గదియువచ్చు, నయ్యనిరుద్ధుండు బాలుండు గావున నతని జయించుటకు సమర్థుండు గాఁ డటుగనుక నేపకడ నీవృత్తాంతంబంతయు శౌరికిఁ దేటపడం బలుకవలయు ననిన నారదుం డెంతయు సంతసించి చిత్రరేఖం జూచి యిట్లనియె.

సీ. మానిని! యట్లన కానిమ్ము వెఱవకు
మనిరుద్ధుఁ దోడ్కొని యరుగు మిపుడు
కలహావలోకనకౌతూహలంబును
జనియించె నెంతయు మనసులోన

నాహవం బచట దైవాధీనమై కద్దె
నేని మమ్ముఁ దలంపు మేమఱకుము
క్షణములో నట వచ్చి రణకేళి వీక్షించి
మగుడి యెఱింగింతు మాధవునకు

గీ. దనుజమదభంగకరచక్రధారి శౌరి
శోణితపురంబుఁ గదిసినచోఁ ద్రినేత్రుఁ
డైన నెదిరించి యనిమొన నానఁగలఁడె
బాణుఁడును గీణుఁడన నేల? భయము నీకు. 84

చ. అనుటయుఁ జిత్రరేఖ మది నంతయు నట్లన కాఁదలంచి సం
జనితఘనప్రహర్షుఁడగు సంయమివర్యునిచే ననుజ్ఞఁ గై
కొని మఱియుం బ్రణామములుఁ గోర్కులుమీర నొనర్చి వేగమే
చని యల శౌరిమందిరముచాయ నభంబున నిల్చి వేడుకన్. 85

సీ. పంచరత్నంబులపనిహర్మ్యలను జాల
బాగుమీరిన యొకపడకయింటఁ
గొమరైన యపరంజికోళ్ళమంచంబున
మేరువుపై నున్న మేఘ మనఁగ
శృంగారములకెల్ల శృంగారమై మించు
శ్రీరాజగోపాలశౌరి నపుడు
రుక్మిణిమొదలుగా రాధికెక్కినయట్టి
కులసతుల్ పెక్కండ్రు కొలువుసేయఁ

గీ. జూచి సేవించి యెంతయు సోద్యమంది
జగతిఁగల మాయలెల్ల నీస్వామి యెఱుఁగు
నితని వంచించి యనిరుద్ధు నెత్తికొనుచు
నేఁ బురముఁ జేరఁగ నుపాయ మెద్ది! యనుచు. 86

క. తడవాయ వచ్చి యిట కా
పడఁతుక నన్నెట్లు దూఱిపలుకునొ! యనుచున్
జడధారిణి మదిఁ దలఁపుచుఁ
దడయక యనిరుద్ధు దెచ్చుతలఁపున నరిగెన్. 87

—: చిత్రరేఖ యనిరుద్ధుని దోడ్కొని చనుట :—

వ. ఇట్లరుగు సమయంబున.

సీ. మణిసౌధరుచిజాలమహిమచే మిక్కిలి
నందమౌ బలభద్రుమందిరంబు
భద్రేభజవనాశ్వభటసమూహంబుల
దనరారుచున్న సాత్యకిగృహంబు
తతనృత్తగీతవాద్యవిశేషములచేత
భాసిల్లు ప్రద్యుమ్నభవనసీమ
లక్షణాన్వితమయి లక్ష్మిచే నెంతయు
డంబుమీరినయట్టి సాంబునగరు

గీ. చారుదేష్ణను దేష్ణుచారుభాను
భద్రచారుసంగ్రామజిద్భానువింద
ముఖ్యహరిసూనువరగేహములను వేడ్కఁ
జెలఁగఁ గనుఁగొంచు వచ్చి యాచిత్రరేఖ. 88

సీ. గమకంబులైన బంగారుకంబంబులు
గొప్పలౌ విద్రుమకుట్టిమములు
మకరాలనగరాల మలచినతిన్నెలుఁ
దులలేని వైడూర్యతోరణములు

మరకతమాణిక్యమయములౌ మేడలు
నుప్పరం బంటిన చప్పరములు
నెమ్మిగుంపులసొంపు నెలవైన వలభులు
హరువులుమీఱు గవాక్షములును

గీ. గలిగి యెల్లెడ సౌరభకలితకుసుమ
మాలికాలంకృతంబును మహితగంధ
గంధసారసిక్తంబునై ఘనతగాంచు
నట్టి యనిరుద్ధుకేళీగృహంబుఁ గాంచి. 89

వ. అందు.

సీ. పడఁతి యొక్కతె హడపంబు బాగుగఁ బూని
మక్కువమీరంగ మణుపు లొసఁగఁ
గలికి యొక్కతె కరకంకణక్వాణనముల్
పరిఢవిల్లఁగ జీనిసురఁటి విసరఁ
గమలాక్షి యొక్కతె గంధోదకంబులు
నించిన గిండి ధరించి నిలువ
రమణి యొక్కతె బహురాగభేదంబుల
నింపుగా వీణె వాయింపుచుండ

గీ. మఱియు గొందఱువనితలు మమతతోడఁ
దనదుచుట్టును గొల్వంగ ఘనతమీఱి
సరససల్లాపములఁ బొద్దు జరపుచుండు
నట్టి యనిరుద్ధుఁ గనుఁగొని యాత్మలోన. 90

క. వనితాజనపరివృతు నీ
యనిరుద్ధుని నెవ్విధమున ? నటఁ దోడ్కొనిపో
ననువగు నని చింతింపుచుఁ
దనతామసవిద్యపేర్మి తనరఁగ మిగులన్. 91

క. ముచ్చవగమీర నచ్చెలి
యచ్చటిగతు లెఱుఁగకుండునట్లుగ వేగన్
బచ్చవిలుకాని తనయుని
నచ్చెరువుగఁ దోడితెచ్చు నాసమయమునన్. 92

—: అనిరుద్ధుని దోడ్కొనివచ్చుటకై చనిన చిత్రరేఖ
రాకయున్నందులకు నుష చింతించుట :—

క. అనిరుద్ధునిఁ దోడ్కొని యిదె
వనితామణి చిత్రరేఖ వచ్చు నటంచున్
దనరెడు చెలిమిని బాణుని
తనుజన్ గై సేయునట్టి తలఁపమరంగన్. 93

* సీ. పన్నీటిచేతను బాగుమీరఁగ నంత
జలకంబు లాడించె సకియ యొకతె
పొసఁగంగ నవరత్నభూషణావళులచే
నెలమి శృంగారించెఁ జెలియ యొకతె

గీ. విదియచందురుమించిన వెలఁదినుదుటఁ
దిలక మొప్పఁగఁ దీర్చెను గలికి యొకతె
తీరుమీరఁగఁ బాపటఁ దీర్చి చెలికిఁ
గొప్పు సవరించె నొప్పుగఁ గొమ్మ యొకతె.* 94

వ. అంత.

సీ. ప్రతిలేని పసిఁడిచప్పరపుమంచంబునఁ
బరఁగు కుంకుమపూలపఱపుఁ బఱచి
కళుకుసూర్యపటంబుతలగడ లమరించి
బాగైన సకినలబటువు లుంచి

* ఈ పద్యమున సీసపాదములు రెండు మాత్రమే యున్నవి.

కలువడంబులుగల కలువడంబులు గట్టి
రాణించు బుర్నాకురాడ మునిచి
సామ్రాణిధూపవాసనలను నెరయించి
రమణీయరత్నదీపములు నిల్పి

గీ. పొసఁగఁ దెలనాకు కవిరెలు పోఁకముల్లు
పచ్చకపురంబు జవ్వాది మెచ్చువిరులు
మీరిపలికెడు బకదారిపారువములు
నందముగ నించి రౌకకేళిమందిరమున. 95

క. చెలు లిటువలెఁ గై సేయఁగఁ
బొలఁతుక వనశయ్య నుండి పురుషుని మదిలోఁ
దలఁపుచు మదనునిగాసికి
నులుకుచు నిట్లనుచుఁ బలికె నువిదలతోడన్. 96

సీ. తనచెల్మి నెంచి యుత్తరి ద్వారకాపురిఁ
జేరునో! చేరదో! చిత్రరేఖ
పౌరి నలంగముచుట్టుఁ దిరుగుయామికులచేఁ
గూడునో! కూడదో! కోటఁ జొరఁగ
నవరంగజాల లింతకు బీగముద్రలు
సేతురో! మఱపున సేయకుంద్రో!
నెమ్మది నాప్తులు నిదురించుసమయంబు
కలుగునో! కలుగదో! కమలముఖికి

గీ. సకలమర్మంబు లెఱిఁగిన స్వామిగాన
తనమనుమనిఁ దోడ్కొనిపోవు తలఁపెఱింగి
ద్వారకాపురి నెవ్వరుఁ జేరకుండ
భద్రపఱచిన భామ యేపగిదిఁ దెచ్చు? 97

వ. అని పలుకు నుషాకన్యకఁ జూచి నెచ్చెలు లిట్లనిరి.

సీ. ఆచిత్రరేఖ దా నఖిలలోకంబులఁ
బొలుపుమీఱుచు నున్న పురుషవరుల
భావంబులెల్లను బటమున వ్రాసిన
[1]మహిమ నెఱుంగవా మగువ! నీవు
మహిలోనఁ గల్గిన మాయావిశేషముల్
దంద్రిచె నేర్చె నాతలిరుఁబోణి
మన్ననమీఱ నీమగనిఁ దోడ్కొనివచ్చుఁ
గలకంఠిరో! నీవు కలఁగకమ్మ!

గీ. ముజ్జగంబులఁ గల్గిన ముగిత లెల్లఁ
జిత్రరేఖకు నెనయె విచిత్రమహిమ
నేవిధంబుననైన నాయిందువదన
వేడుకలుమీఱ ననిరుద్ధుఁ దోడితెచ్చు. 98

—: చిత్రరేఖ యనిరుద్ధుని నుషవద్దికి జేర్చుట :—

వ. అని యూఱడించు సమయంబున

సీ. వాయుతనూజుండు వాయువేగంబున
సంజీవనిం దెచ్చు చందమునను
వినతాతనూజుండు వేడుకమీఱంగ
నమృతంబు దెచ్చినయందమునను
నల్ల భగీరథుం డాత్మ నుప్పొంగుచు
నమరనదిం దెచ్చునట్టిలీలఁ
జెలువంబువెలయంగ శ్రీరాజమన్నారు
పారిజాతముఁ దెచ్చుభావమునను

1. మఱుమెఱుంగవా,

గీ. సత్యవతిని భీష్ముఁడు దెచ్చునరవి మెఱయఁ
గుండలము లుదంకుఁడు దెచ్చుకూర్మి నరయ
నమరసౌగంధికంబుల ననిలజుండు
దెచ్చుకై వడి ననిరుద్ధుఁ దెచ్చు వేగ. 99

క. ఈకై వడి ననిరుద్ధునిఁ
బ్రాకటముగఁ దెచ్చి నిల్పి పానుపుమీఁదన్
రాకేందుముఖులు మెచ్చఁగ
నాకలికిన్ జూచి పలికె హర్షముతోడన్. 100

క. వనజాతనేత్ర! కనుఁగొను
మనిరుద్ధు మహాప్రసిద్ధు నంబుజనేత్రున్
గనకనిభగాత్రు మురభం
జనపౌత్రుని మదనపుత్రు సద్గుణపాత్రున్. 101

క. చెలువునిఁ దెచ్చితి నీతోఁ
బలికిన యటువంటి నాదుపంతము చెల్లెన్
నెలయును రోహిణియుం బలె
నలివేణి! విభునిఁ గూడి సుఖరము వేడ్కన్. 102

వ. అనిన నచ్చెలిం జూచి యచ్చిగురుఁబోఁడి యిట్లనియె.

సీ. నిఖిలలోకంబుల నీవంటి నేర్పరిఁ
గని విని యెఱుఁగనే కంబుకంఠి!
కలలోనఁ గలసినకాంతునిఁ దెమ్మన్న
క్షణములోఁ దెచ్చితి చంద్రవదన!
కందర్పుచేతను గాసిఁజెందిననాఁడు
ప్రాణంబు నిలిపితే పద్మగంధి!
ధర నెంతవారికిఁ దలఁచఁ గూడనియట్టి
తలఁపు లీడేర్చితే తలిరుఁబోఁడి!

గీ. కలికి ! నీవు చేసిన యుపకారమునకు
నిపుడు ప్రత్యుపకారంబు లేమి సేతు ?
ననుచు సొమ్ములుఁ గోకలు నతివ కొసఁగి
కదిసి కౌఁగిటఁ జేర్చెను గారవమున. 103

క. శ్రీరఘునాథసుధాంబుధి
కైరవిణీమిత్ర ! సకలకవినుతపాత్రా !
భూరిభుజాబలనిర్జిత
వైరిజనస్తోమ ! విపులవైభవధామా ! 104

క. చెంగమలేశపదాంబుజ
[1]సంగస్ఫురితాంతరంగ ! సదయాపాంగా !
సంగీతసాహితీప్రియ !
సంగరకౌంతేయ ! సకలసజ్జనగేయా ! 105

—: ద్రుతవిళంబితవృత్తం :—

సుజనరక్షణశోభనవీక్షణా !
విజయకారణవిశ్రుతవారణా !
విజయ శాత్రవవీరనుతాహవా !
విజయరాఘవ ! విక్రమభార్గవా ! 106

గద్య. ఇది శ్రీమద్రాజగోపాలకరుణాకటాక్షవీక్షణానుక్షణప్రవర్ధమాన సారసారస్వతధురీణయు విచిత్రతరపత్రికాళతలిఖితవాచికార్థావగాహనప్రవీణయు తత్ప్రతిపత్రికాళతస్వహస్తలేఖనప్రశస్తకీర్తియు శృంగారరసతరంగితపదకవిత్వమహనీయమతిస్ఫూర్తియు అతులితాష్టభాషాకవితాసర్వంకషమనీషావిశేషశారదయు రాజనీతి

1. సంగి.

విద్యావిశారదయు విజయరాఘవమహీపాలవిరచితకనకాభిషేకయు విద్వత్కవిజనస్తవనీయవివేకయు మన్నారుదాసవిలాసనామమహాప్రబంధనిబంధనకృతలక్షణయు మహనీయరామాయణభాగవతభారతకథాసంగ్రహణవిచక్షణయు పసపులేటి వెంకటాద్రిబహుజన్మతపఃఫలంబును మంగమాంబాగర్భశుక్తిముక్తాఫలంబును రంగద్గుణకదంబయు నగు రంగాజమ్మ వచనరచనాచమత్కృతిం జెన్నుమీఱు ఉషాపరిణయంబను మహాప్రబంధంబునందుఁ ద్వితీయాశ్వాసము.

—: శ్రీరాజగోపాలాయనమః :—

---

శ్రీ రాజగోపాలాయనమః

# ఉషాపరిణయము

(పద్యకావ్యము)

## తృతీయాశ్వాసము

క. శ్రీరాజ[1]గోపహరిచర
ణారాధనసావధాన ! యర్థినిధానా !
వీరారిమదవిజృంభణ
వారణ ! శ్రీవిజయరాఘవక్ష్మారమణా ! 1

వ. అవధరింపుము.

—: చిత్రరేఖ యనిరుద్ధుని వర్ణించుట :—

క. ఇవ్విధమున లాలించిన
జవ్వనిఁ గనుఁగొనుచు మిగులసంభ్రమ మొప్పన్
నివ్వాటిలు ప్రేమతోడను
బువ్విలుతుని సుతునిఁ జూపి పొలఁతుక యనియెన్. 2

సీ. ఇందుబింబముతోడ నెనవచ్చు నీతని
        నెమ్మోముఁ జూడు మిందీవరాక్షి !
భానుసమానుఁడై భాసిల్లు నీతని
        తేజంబుఁ జూడు మంభోజనేత్ర !

1. గోపాళ

చక్కెర లొల్కెడు చక్కని యీతని
కెమ్మోవిఁ జూడుము కీరవాణి!
పండువెన్నెలచాయ భాసిల్లు నీతని
కుఱునవ్వుఁ జూడు చకోరనయన!

గీ. యరులపై బాణవర్షముల్ కురియుకతన
జ్యాకిణాంకితమించు బాహాయుగంబుఁ
బరులతల మెట్టు మృదు[1]పాదపంకజముల
భామ! వీక్షింపు కన్నులపండువుగను. 3

వ. అని పల్కుచున్న సమయంబున.

—: అనిరుద్ధుఁడు కలఁగని మేల్కని యాశ్చర్యపడుట :—

సీ. అందంబుమీరంగ నలివేణి యొక్కతె
మొలమిఁ దోడ్కొనివచ్చి యింపుమీరు
బంగారుమేడలో బాగుగా హవణించు
పువ్వులపాన్పుపైఁ బొసఁగ నుంచ
మెఱుఁగుదీఁగెనుబోలు మృగనేత్ర యొక్కతె
శయ్యపైఁ గూర్చుండి నెయ్యమమరఁ
జక్కెర మోవాని సరసంబు మీరఁగాఁ
బుక్కిటివిడె మిచ్చి బుజ్జగించి

గీ. తలిరువిలుకాని కేళినిఁ దనివిదీరఁ
గలసినట్లుండఁ గలఁ గని కాంతుతోడ
బాళి నయ్యనిరుద్ధుండు మేలుకాంచి
యెదుట నిలుచున్న చక్కనియింతిఁ జూచె. 4

1. జాల

వ. మఱియును.

చ. చెలువగు హేమసౌధమును జిత్రపటంబుల నెమ్మిగుంపులన్
చిలుకలపంజరంబులను జెల్వుగఁ బల్కెడు పావురంబులన్
బలుమరు వ్రాయ నందియలు ప్రాంతమునన్ జెరియించునంచలన్
గలయఁగఁ జూచె నచ్చెరువు గ్రమ్మఁగ సారెకు నెమ్మనంబునన్.

సీ. త్రిజగంబునను గల్గు తేజోనిధుల నెల్ల
బాగుగా వ్రాసిన పటమునందు
భలభద్రుఁడును శౌరి ప్రద్యుమ్నుఁడును దాను
మహినిఁ బ్రసిద్ధులౌ మనుజపతులు
మఱియొక్క పటమున మందరగిరిలీల
మిక్కిలిఁ బొడవైన మేనుఁగల్గి
వేయికరంబుల వివిధాస్త్రములుఁ బూని
సురులు గెల్వఁగనున్న శూరుఁడొకఁడు

గీ. చెలఁగుచుండఁగఁ జూచి యచ్చెరువుఁజెంది
మనుజవర్యుల దనుజుల మహిమమీఱ
సురల నీక్రియ వ్రాయంగ సోద్య మయ్యె
నెవ్వనిదొకాని యీసౌధ మెంతవింత ! 6

వ. అని వితర్కింపుచు.

ఉ. ద్వారకలోన నానగరతామరసాక్షులు కొల్వఁ జుట్టులన్
గోరిక నున్న నే నవుర ! గోప్యముగా నిట కెట్లు వచ్చితిన్
వీరలఁ జూడ నామదికి వింతయి తోఁచె నిదేమి చోద్యమో !
యారయ స్వప్నమో ! నిజమొ ! యక్కట ! భ్రాంతియొ !
యంచు నెంచుచున్. 7

క. కలఁ గనెడువారు లేరా
కల యెవ్వరికైన నిజముగా నీకరణిన్
దెలియన్ ముందటఁ దోఁచునె
పలుకఁగ నిది వింత యనుచు భావములోనన్. 8

క. ఎవ్వరితోడం బలుకుదు ?
నెవ్వరు ? తను నెఱుఁగువార లిందటిలోనన్
జవ్వనులఁ జేరఁబిల్చిన
నవ్వుచుఁ దూలఁగుదురో ! లేక నను జేరుదురో ! 9

క. నెయ్యముఁ జేసి ప్రసంగము
దియ్యుచు నీకార్యమెల్ల దెలియుద మని తా
నొయ్యారమమర నప్పుడు
శయ్యను గూర్చుండి మిగుల సరసంబమరన్. 10

—: ఉషానిరుద్ధులు పరస్పరసౌందర్యము గని పరవశులగుట :—

సీ. చెలులు చుట్టును గొల్వఁ జిలుకరాకువిల్కాని
మోహనాస్త్రంబన మురువుమీరి
సిగ్గుచేఁ దల వంచి చిరునవ్వు నవ్వుచుఁ
గ్రేగంటఁ దనుజూచు కీరవాణిఁ
బసిఁడిసలాకతోఁ బ్రతివచ్చు నెమ్మేని
కాంతులు దిక్కులఁ గలయఁబర్వ
మిక్కిలి ప్రేమచే మేను చెమర్పంగఁ
దనలోన రతిఁగూడఁ దలఁచుదాని

గీ. బాణసుతఁ జూచి యెంతయు భావమలర
నడుగవచ్చిన కార్యంబు నపుడు మఱచి
మరుని మాయలచేఁ జిక్కి మదనసూనుఁ
డెలమిఁ దలయూఁచి సొక్కుచు నింపుమీర 11

సీ. సరిచెంత్రుకలకప్పు దొరయు నీచెలికొప్పు
నీలమేఘములీరు లీలఁ గేరు
కాంతుల వాటంబు కాంతలలాటంబు
విదియచందురుకొవ్వు వేగ నవ్వు
నమృతంబునకు దీవిదైన యీసకిమోవి
పగడంబులను బొల్చు బాగు గెల్చు
కలువరేకులనేలు కలికికన్నులడాలు
నిడువాలుగలనంచు నీట ముంచు

గీ. వెలఁదికనుబొమ లతనుని విండ్లకొమలు
చంపకశ్రీల వెన్నాస చాననాగు
చెనకుఁ జెందంబులకులంబుఁ జెలిగళంబు
పంచదారలుఁ గుల్కు నీభామపల్కు. 12

సీ. తామరతూడులఁ దరమిడి విరసించు
కొమ్మభుజంబులకొమరు భళిర!
బంగారుకుండల బాగెంత లేదను
కువలయలోచనకుచము లవుర!
కేసరిమధ్యంబు గేలిసేయఁగఁజాలు
గజరాజగామినికౌను మేలు
కందర్పు నసిధారఁ గడకుఁ ద్రోయఁగ నెంచు
మెలఁతనూఁగారును మెచ్చవచ్చు

గీ. సైకతంబుల గెల్చును జానజఘన
మరఁటికంబంబుల నదల్పు నతివతొడలు
కమలగర్భంబులను గెల్చుఁ గలికిజంఘ
లబ్జముల నవ్వు నీయింతియడుగు లెంచ. 13

క. కుందకయుండఁగఁ గరముల
నిందుముఖిఁ బ్రహ్మయెట్లు సృజియించెనొకో!
యందంబు బొగడఁ దరమా!
కందర్పుని రాజ్యలక్ష్మికైవడి నమరెన్. 14

సీ. రెప్పవేయక నేను దప్పక చూచితే
తరుణిమోమున దృష్టి తాఁకు నొక్కొ!
ముచ్చటదీరనే మొనపంట నొక్కితే
కమలాక్షికెమ్మోవి కందు నొక్కొ!
కోరికమీఱ నేఁ గొనగోట మీటితే
పణఁతిగుబ్బ లపుడె పగులు నొక్కొ!
పచ్చవిల్తుని కేళి బాళి నేఁ గూడితే
బాలిక నెమ్మేను బడలు నొక్కొ!

గీ. అట్లుగావునఁ బూర్ణశశాంకవదన
బాగుమీఱినయట్టి యీపల్లవోష్ఠి
కాంతులును జాలఁ జెలువొందు కలశకుచకు
సీలకాంగినిఁ గూడుట యెట్టు లొక్కొ! 15

సీ. శౌరిని సేవింప జంభారి యేతేరఁ
గనుఁగొంటి రంభాదికామినులను
శ్రీకృష్ణు సేవింపఁ జిత్రరథుండు రాఁ
గనుఁగొంటి గంధర్వకన్యకలను
జలజాక్షుఁ బూజింప నలకుబేరుఁడు రాఁగఁ
గనుఁగొంటిఁ గిన్నరవనజముఖుల
హరిఁ జూడ సకలదేశాధీశ్వరులు రాఁగఁ
గనుఁగొంటి మనుజశృంగారవతులఁ

గీ. కలదె దీనియొయ్యారమే కాంతలకును
జూడ మిటువంటిచెలువ మేమనుజులందు
బ్రహ్మ యెట్లు నిర్మించె నీపద్మముఖిని
నెంత యని సన్నుతింతు నీయింతిసొగసు. 16

వ. అని యనిరుద్ధుఁడు తనమనంబున వితర్కించు సమయంబున

క. అనిరుద్ధుని సౌందర్యము
వనితామణి చూచి మిగుల వాంఛలుమీరన్
మనమున సోద్యం బందుచు
వినుతించెను వానిసొగసు వేడుకమీరన్. 17

సీ. సకలంకమైనట్టి చంద్రబింబము వీని
వదనంబుతో సాటివచ్చు టెట్లు ?
రేయెల్ల ముకుళించు తోయజంబులు వీని
కన్నులసామ్యంబుఁ గాంచుటెట్లు ?
పగతురఁ గని పారు ఫణిరాజములు వీని
భుజములపోలికఁ బొందు టెట్లు ?
అమితటంకవిభేద్య మగుకవాటము వీని
వక్షంబునకు సరివచ్చు టెట్లు ?

గీ. యింతచక్కనివాని నే నెందుఁ జూడ
వీనిఁ జూడంగఁ జూడంగ వేడుకయ్యె
వేయికన్నులు గలిగిన వీనిసొగసుఁ
గలయ వీక్షింతు నామదికాంక్షదీర. 18

ఉ. నిద్దుర లేచియు న్మిగులనేర్పున రమ్మని నన్ను వీఁడు తా
నొద్దికఁ జేరఁదీయక నె యూరక యుండుట కేమి హేతువో !
తద్దయు ద్వారకాపురము తామరసాక్షులఁ జూడ వీని కా
నిద్దపురూపులున్ మిగులనేర్పులు లేవి తెలియగా ? నామదన్. 19

—: మన్మథుఁ డుషానిరుద్ధుల మోహాపరవశులఁ జేయుట :—

వ. అని తలంచు నయ్యవసరంబున

చ. ఉదుటగు చిల్క తేజిపయి నుద్ధతిమీఱఁగ వచ్చి నిల్చి తా
నెదురుగఁ దేఁటినారి మొరయింపుచుఁ బువ్వులవింటి వారలన్
గదసి ప్రసూనవర్షములు గాఢముగా వరుషించె నెంచఁగా
మదనుఁడు బంచబాణుఁ డనుమాట నిజంబగునే తలంపఁగన్.

క. తనయునిమీఁదనే దాడిగ
జనకుండట వచ్చెనన్న సమ్మతి యగునే
యని గలదు బాణుతో నని
తనబలములఁ గూడి వచ్చెఁ దథ్యం బరయన్. 21

చ. అల విరివింటిరాయలు సహాయత వచ్చిన వచ్చెఁగాని తా
బలువిడి వారిపైఁ గుసుమబాణములేయుట యేమి యంటివా
యలరఁగఁ దద్వివాహసమయంబున కచ్చుగ వచ్చి పూలచేఁ
జెలువుగ వారికిద్దఱికి సేసలుఁబెట్టుట యే నిజంబగున్. 22

వ. ఇవ్విధంబున.

సీ. పచ్చవిల్తుఁడు వాఁడిబాణంబు లేయఁగా
నాయుష యిట్లను నాత్మలోనఁ
గలలోనఁ గలయు నీకందర్పతనయునిఁ
దోడితెమ్మని చాల వేఁడుకొనఁగ
ద్వారకాపురిఁ జేరి తరలాక్షి నామీఁది
నెనరున నిటుదెచ్చె నేర్పుమెఱసి
యేమిసేయుదు నీతఁ డింతి రమ్మని పిల్చి
గారవించడు మది కాఁకదీరఁ

గీ. ప్రియుఁడె తను జేర రమ్మని ప్రేమమీర
గారవించిన మిక్కిలి ఘనతగాని
బలిమిచేఁ జేరఁబోయినఁ జులుకగాదె!
వలపు దాఁచెద నంటినా వశముగాదు. 23

—: అనిరుద్ధుఁడు చిత్రరేఖను వివరముల నడుగుట, చిత్రరేఖ యనిరుద్ధునికి సకలము చెప్పుట :—

వ. అని వితర్కించు సమయంబున.

క. ననవింటివానిగాసికి
మనమునఁ దాళంగలేక మమతలు హెచ్చన్
వనజాక్షి నొకతెఁ గనుఁగొని
యనిరుద్ధుం డిట్టు లనియె నందముగాఁగన్. 24

క. ఎవ్వతె యీబాలామణి?
యెవ్వరి దీకనకసౌధ? మిది యేనగరం!
బెవ్వరివారలు మీరలు!
జవ్వని! తెలుపంగవలయు సత్యముగాఁగన్. 25

వ. అనిపల్కిన యనిరుద్ధుం జేరవచ్చి చిత్రరేఖ యిట్లనియె.

సీ. ఇది శోణపురమందు రిందుకు నాథుండు
ప్రహ్లాదవంశుండు బాణుఁ డరయ
నల బాణుపుత్రి యీయువతివలమేల్బంతి
"ఉష" యనువిఖ్యాతి నొప్పుమీరు
నిచట నుండెడువార మిందఱ మీయింతి
చెలులము నాపేరు చిత్రరేఖ
కలలోన నిను గూడి కాముసిగాసిచే
కాంత నను వేఁడ నెలమితోడ

గీ. ముజ్జగంబులఁ గలవారిమూర్తు లెల్లఁ
బటమునను వ్రాసి చూప నీభామ ప్రేమ
నీదురూపంబు రేఖయు నెమ్మిఁ జూచి
నిన్ను దోడ్కొనిరమ్మన్న నేర్పుమీఱ. 26

ఉ. ద్వారక కేగి యాపురమువారలు నన్ గనకుండునట్లుగా
సారెకు మాయఁగప్పి యల శౌరినివాసమునున్నగాఁగ మీ
వారినగళ్లలో వెదకి వైణికమానియనుగ్రహంబున
స్వైరము తోడితెచ్చితిని నిన్నిటకున్ మకరాంకనందనా! 27

మ. చెలిమిన్ లక్ష్మిని జోడుఁగూడి హరి దాఁజెన్నొందు చందంబునన్
బలుకుం దొయ్యలిఁ గూడి బ్రహ్మ కడుఁబ్రేమన్ మీఱు బా
గొప్పఁగా
నల పౌలోమినిఁగూడి వాసవుఁడు నెయ్యంబొప్ప వర్ధిల్లు న
ట్లెలమిన్ భామిని నీవు గూడి పదివేలేండ్లుండుమీ యిద్దరన్. 28

క. అని పల్కిన చెలిమాటలు
విని యావలరాజసుతుఁడు వేడుకమీఱన్
దనమనసు దాఁచ కప్పుడు
ననఁబోఁడిమొగంబుఁ జూచి నవ్వుచుఁ బల్కెన్. 29

సీ. బాణనందనకును బ్రాణపదంబైన
సకియవుగావున సరవిమీఱ
భావింప మాకును బ్రాణపదంబైన
దానవు నీకును దాఁచనేల
కలలోనఁ గూడిన కాంతయే నీకును
నిల్లాలగు నటంచు నెలమి మున్ను
ముక్కంటిసతి పల్కె మోదమున ననుజూచి
నెలఁత! నే నిప్పుడు నిదురవోవ

గీ. నిచ్చటికి నీవు నను దోడితెచ్చినట్లు
వేడుకను నన్ను నీయుష గూడినట్లు
మేలుగలయట్టి కలఁ గని మేలుకనుచు
నిజముగా నిమ్మెఁ జూచితి నీరజాక్షి ! 30

వ. అనిన ననిరుద్ధునిఁ జూచి చిత్రరేఖ యిట్లనియె.

క. రమణుల నెందఱినైనను
రమణీయత నేఁకొన్న రసికుఁడవుగదా !
తమితోడుత మాచెలి నిపు
డమరఁగ రతి నేలుకోర యతనుకుమారా ! 31

క. అని యొకపని నెపమున న
[1]య్యనుఁగుచెలియ చెలులతోడ నావలికేగన్
వినమితముఖియా నుషఁ గని
యనిరుద్ధుం డపుడు మందహాసముమీరన్. 32

—: అనిరుద్ధుఁ డుషను గాంధర్వమున వివాహమాడుట :—
సంభోగశృంగారము

క. మనకోరిక లీడేరెను
వనితామణి ! రమ్మటంచు వాంఛలుమీరన్
దనరెడు గాంధర్వంబునఁ
దనకరమున నింతికరముఁ దడయక పట్టెన్. 33

సీ. చేరంగ రమ్మని చేపట్టి తీసినఁ
జిరునవ్వు నవ్వుచుఁ జే విడల్చుఁ
బయ్యెదఁ దొలఁగించి బటువుగుబ్బలఁ [2]బట్ట
మాటికిఁ జనుదోయి మఱుఁగుసేయు

1. య్యనుఁగు జెలిచెలులతోడ నావలికేఁగన్
2. పటి

మోము మోమునఁ జేర్చి ముద్దుపెట్టఁగ రాఁగ
మురిపెంపు సిగ్గుతో మోముఁ ద్రిప్పుఁ
బ్రేమంబుమీరఁగ బిగువుగాఁగిటఁ జేర్ప
లజ్జచేఁ బతికేలు లలినిఁ ద్రోయుఁ

గీ. కోఁకముడి వదలింపఁగఁ బొంకముగను
ముడి సడల్పంగనీయక ముదిత పెనఁగుఁ
గాముకేళికిఁ దమితోడఁ గలయరాఁగ
గోల నలుదిక్కులను జూచుఁ గొంకుమిగుల. 84

వ. అయ్యవసరంబున.

సీ. ముచ్చటదీరఁగ ముద్దుబెట్టవె చేరి
మోమేల త్రిప్పెద ముద్దుగుమ్మ!
వీనుల నమృతంబు వెదచల్లునట్లుగా
మాటలాడ వదేమి మచ్చకంటి!
మరుకాఁకదీరంగ మమతలు హెచ్చంగఁ
[1]గాఁగిలింపవె నన్ను కలువకంటి!
యక్కునఁ గదియించి యూరిదంపుచుఁ బ్రేమఁ
బుక్కిటివిడె మీవె పువ్వుఁబోణి!

గీ. భామ! మొక్కెద నే నీదు పదములకును
మనవు లాలించి యేలవే మందగమన!
చాలదయఁ జూడవే నన్ను సన్నుతాంగి!
రతుల నన్నేలవే లీల రాజవదన! 85

1. కాఁగిలింపఁగ

క. అని లాలించుచు నయ్యువ
నని రుద్ధుఁడు చేరఁగీసి యందముగాఁగన్
దనతొడలమీఁద నుంచుక
వనితామణిమేను నిమిరి వలపమరంగన్. 86

సీ. కుంకుమఁ బూసెదఁ బొంకంబుగా నని
కులుకుసిబ్బపుగబ్బిగుబ్బ లంటి
తీరుగాఁ గస్తూరి దిద్దెద ననుచును
దేటైన చెక్కిలి గోట జీరి
పుక్కిటివిడెంబుఁ బొసఁగ నిచ్చెద నని
ముచ్చటదీరఁగ మోవియాని
నీటుగాఁ గుచ్చెలనెఱిక దిద్దెద నని
మురువుమీరిన పోఁకముడి వదల్చి

గీ. మేను నిమిరెదుకైవడి మించువేడ్కఁ
గదిసి కళలంటి సొక్కించి గారవించి
కాఁకదీరఁగఁ గౌఁగిటఁ గదియఁ జేర్చి
సిగ్గుఁదొలగించె నప్పు డాచెలువ కతఁడు. 87

క. గిలిగింత లిడుచు మిగులన్
గలరవములు మించునట్టి గళరవములఁ దా
వలపులుగులుకఁగఁ బలుకుచు
జలజాక్షిని రతులఁ గూడి సంతసమమరన్. 88

సీ. బాలిక బడలిన భావంబుఁ గనుఁగొని
ముదముతో విభుఁ డిచ్చె మోవితేనె
శీతాంశుముఖ మేనఁ జిరుచెమటలుఁ జూచి
చెలువుం దుప్పటిచేత నొత్తె

మదిరాక్షి ముంగురుల్ చెదరిన వీక్షించి
పతి గోరులను దువ్వె బాగుమీర
జలజాక్షి నుదుటను జాఱిన తిలకంబు
రాణించఁగా దిద్దెఁ బ్రాణవిభుఁడు

గీ. మొలఁత యుపరతులను జాల నలసియున్నఁ
దొయ్యలిపదంబు లప్పుడు తొడల నుంచి
నెయ్య మమరంగ నొత్తుచు నెనరుమీర
నచ్యుతునిమన్మఁ డీలీల నాదరించె. 39

వ. అంత.

ఉ. మనసిజకేళిఁ దాను పతి మక్కువమీరఁగఁ గూడియుండుటల్
ఘనమగునట్టి మానికపుకంబమునన్ గనుపట్టుచుండఁగాఁ
దనచెలువుండు వేరె యొకతామరసాక్షినిఁ గూడె నంచు వే
కనుఁగొనుచున్ బరాఙ్ముఖతఁ గాంచెను ముగ్ధలుగారె మానినుల్.

—: విప్రలంభశృంగారము :—

వ. అంత.

క. జవ్వని నేరము లేకనె
యివ్వగ నలుగంగ హేతువేమీ ? యనుచున్
నివ్వెఱగందుచు మదిలో
నవ్వలిమోమయ్యె నప్పు డనిరుద్ధుండున్. 41

క. ఇరువురు నీక్రియ నుండఁగ
మఱుఁ డప్పుడు చేరి మిగుల మమతలు హెచ్చన్
దుఱుసైన తుంటవింటను
విరి గోల(ను) నేసి యార్చె వేగముగాఁగన్. 42

వ. ఇవ్విధంబున బాణపరంపరలు నించు మించువిల్కాని వేఁడిమికిఁ దాళఁజాలక యాబాణపుత్రిక తనలోఁ దా నిట్లనియె.

సీ. కలలోనఁ గూడిన కాంతునిఁ దెమ్మని
చిత్రరేఖను వేఁడ (చిత్ర)గతిని
నీతనిఁ దోడ్తెచ్చి యెలమితో నను గూర్పఁ
గంతుని కేళినిఁ గలసి సొలసి
సంతసంబమరంగ సౌఖ్యాబ్ధిఁ దేలుచుఁ
గంబంబులో నీడఁ గాంచి యపుడు
భ్రమసి యిదేమని పల్కరించక యూర !
యిల్లేల ? యలిగితి నితనితోడ

గీ. నేన ముందుగ నితనితో నిపుడు పల్క
నలిగియున్నది తాను మాటాడ దనుచు
నాథుఁ డెంతయు నను జూచి నవ్వనొక్క !
యేమి సేయుదు ? నీయల్క యెట్లు తీరు ! 43

సీ. కదిసి ప్రేమను వీనిఁ గౌఁగిలించకయున్న
నతనుతాపము చల్లనౌట యెట్లు ?
ముచ్చటతో వీనిమోవి యానకయున్నఁ
బచ్చవిల్తుని బారిఁ బాయు టెట్లు ?
సారెకు వీనితో సరసమాడకయున్నఁ
గంతుని హుంకృతి గడచు టెట్లు ?
తొడరు వేడుక వీనితొడల నుండకయున్న
దలిరువిల్తుని దాడిఁ దప్పు టెట్లు ?

గీ. చేరి చెక్కిలి నొక్కుచుఁ జెలిమి మిగుల
గళరవంబులుఁ బల్కుచు వలపు హెచ్చఁ
దనివి దీరంగ వీనితోఁ బెనఁగకున్న
సింమవిల్తుని నిపుడు జయించు టెట్లు ! 44

సీ. ముదిత! రమ్మని వీఁడు ముందుగాఁ బల్కితే!
చెఱకువిల్కానికి జెఱవుసేతుఁ
గాంత! రమ్మని వీఁడు కౌఁగిటఁ జేర్చితే
పువ్వులవిల్తునిఁ బూజసేతుఁ
జాన! రమ్మని వీఁడు సరసంబు లాడితే
చిగురువిల్కానికి సేవఁజేతు
రమణి! రమ్మని వీఁడు రతికేళిఁ గూడితే
పచ్చవిల్కానిని బ్రస్తుతింతు

గీ. నిఱవురము యేము రేబగ లెనసియున్న
నల వసంతునిఁ జంద్రుని మలయపవనుఁ
బ్రాణబంధువు లనుచును భావమునను
గోర్కిమీఱఁగ నీవేళఁ గొలుతు నేను. 45

సీ. పంచదార నొసంగి బాగుగాఁ బెంచిన
చిలుకైన నితనితోఁ దెలుపదాయె
బాళినే సాఁకిన పారువంబైనను
బతికిని దమిబుట్టఁ బలుకదాయె
నెనరుతో నడుపులు నేర్పిన యంచైన
నాథునిదూత్యంబు నడపదాయెఁ
బ్రాణపదంబైన బట్టిగాఁడైనను
జెలువునికిని బుద్ధిఁ జెప్పదాయెఁ

గీ. గోర్కిమీఱఁగఁ గలలోనఁ గూడి మిగుల
నూఱుఁబేరును నెఱుఁగకయున్న విభుని
నెనరుతో నన్నుఁ గూర్చిన నేర్పుఁగలుగు
చిత్రరేఖైన నీవేళఁ జేరదాయె, 46

క. అని మనమున నుష యీగతి
ఘనమగు విరహంబుచేతఁ గలఁగంగా న
య్యనిరుద్ధుం డావేళ న
తనమనమున నిట్టులనుచుఁ దలఁచెను బ్రేమన్. 47

సీ. ఇంతి ! నీవలిగిన హేతు వెయ్యది ? యని
యడుగక నే నేల ? యలిగి తకట !
కలికి ! నీయలుకకుఁ గారణం బేమని
యిపుడు నే నడిగితే యింతతడవు
పలుకక యిప్పుడు పల్కవచ్చె నటంచుఁ
బలుకునో ! పలకదో ! పద్మగంధి
మోడి యేమిటి ? కని మ్రొక్కి నే వేఁడినఁ
జూచునో ! చూడదో ! శోభనాంగి

గీ. యీ విరహసాగరము దాఁట నేది ? తేప
యేమిసేయుదు ? నీకోప మెట్లుదీరు ?
నిమిష మేఁడయి తోఁచెను నెనరుమీర
వెలఁదిఁ గూర్పంగ నెవ్వరి ? వేఁడుకొందు. 48

సీ. కదియుచీఁకటిఁ జంద్రుఁ డుదయించు టౌగదా !
తెఱవ యిప్పుడు మోముఁ ద్రిప్పెనేని
యాకలిఁగొన్నచో నమృత మబ్బుటగదా !
యింతి కెమ్మోవాన నిచ్చెనేని
పేదకు బంగారుబిందె లబ్బుటగదా !
చెలువ కుచము లంటఁ జేర్చెనేని
యెండ నుండఁగ నీడ యెదురువచ్చుటగదా !
[illegible]

గీ. యనుచు మనమున యోజింపు చింతఁదు మిగులఁ
గలయ నలుదిక్కులునుఁ జూచి కాఁక హెచ్చ
భామఁ గూడుటకు నుపాయమేమి యనుచు
భావమున మకరాంకుని భజనసేయ. 49

సీ. పాలయల్క చేతను బాలఁతి యుండఁగఁ జేరి
పతి మ్రొక్కుచున్నట్టి భావములును
నవ్వుటాలకును నాథుం డల్గినం జూచి
సతి వేఁడుకొనుచున్న చందములును
నా పడకింటిలో నందంబుమీఱిన
చిత్రపటంబునఁ జెలఁగఁ జూచి
ఘనత నీచిత్రరేఖాదర్శనంబున
మరుకాఁక యొకకొంత మట్టుపడియె

గీ. ననుచుఁ బతి పల్క విని తనయాత్మలోనఁ
జిత్రరేఖను గనుఁగొను చెల్మిమీఱ
బాణనందన మగుడినఁ బతియు వేడ్కఁ
దాను నభిముఖుఁ డగుచును దరుణిఁ గూడె. 50

—: ప్రభాతమున నుషానిరుద్ధులఁ జూచి చెలులు సంతసించుట :—

వ. అంత.

క. ముదమున సహస్రకరుఁ డనఁ
గదనంబున మించు బాణుకరములు ద్రుంచన్
గదియు హరిఁ జూతు మనుక్రియ
నుదయాచలమందు భానుఁ డుదయంబయ్యెన్. 51

వ. ఆసమయంబున.

సీ. ఒయ్యారమునఁ దనయురమున నొరగిన
        నతివమోవానెడు నందగానిఁ
జెలువుమీరఁగఁ దనచెక్కిలి నొక్కిన
        కొమ్మగుబ్బలు జీరు కోడెకానిఁ
దీరుగా నుదుటను దిలకంబు దిద్దెడు
        వనితెకొప్పును దువ్వ వన్నెకానిఁ
గలపంబుఁ దనమేన గలయంగ నలఁదెడు
        నువిదనీవి వదల్చు హాయిలుకాని

గీ. నోరి ! రమ్మని ప్రేమ బింబోష్ఠి పిల్వ
    భామ ! యూడిగ మేమని ? పలుకువాని
    నల్ల యనిరుద్ధుఁ జూచిరి హర్ష మొదవఁ
    జిత్రరేఖయు మొదలైన చెలువలెల్ల. 52

వ. అందు.

సీ. సుదతి ! వీరలచెల్వుఁ జూచితె కన్నులు
        చల్లనాయె ననియె సకియ యొకతె
    భళి ! వీరి నిర్వురఁ గలయఁగూర్చితి వని
        చిత్రరేఖను మెచ్చెఁ జెలువ యొకతె
    రతిమన్మథులలీల రాణించి రనుచును
        వన్నెమీరఁగఁ బల్కె వనితె యొకతె
    యింతచెల్వమువారి నెలమితో సృజియించు
        బ్రహ్మ నేర్పరి యనె పడఁతి యొకతె

గీ. చక్కదనమున సరసత జవ్వనమున
    నిరువురకుఁ దగు నని యెంచె నింతి యొకతె
    యెంతచక్కనివార లీయిరువు రనిన
    [illegible] 53

వ. అని నీనెచ్చెలులు ముచ్చటనున్న యా సమయంబున.

—: అంతఃపురపు కావలివారు ఉషానిరుద్ధులుండు విధము గని యచ్చెరువంది బాణుని కెఱుకపఱచుట :—

సీ. గండశైలమురీతి గనుపట్టు శిరముల
విరసి తూలెడు పల్లవెంట్రుకలును
బండికండ్లను గేరు బటువులౌ మిడిగ్రుడ్ల
వేఁడిమి వెదచల్లు వీక్షణములు
కను విశాలములైన కడుపులపైఁ బడి
జానుల జాఱెడు చన్నుగవలు
వంకలై కనుపట్టు వాఁడిగోరలుఁ గల్గి
చాకిబానల మించు బాకినోళ్లుఁ

గీ. బ్రాఁతచేటల కెనయైన పాదములును
గటికిచీఁకటిఁ గమ్మెడు కారుమేను
లమర గుదియలబోలు బెత్తములుఁ బూని
అన్నగారులు తమవెంట నంటినడవ. 54

చ. కనకమయాంబరంబులును గస్తూరివీణియలుఁ జవాదియుఁ
బునుఁగును గుంకుమంబు ముడిబువ్వులు తావులుగుల్కు చందనం
బును దెలనాకుకట్టలను బోఁకలముళ్లను బాణపుత్రికిఁ
దినమును దెచ్చుకట్టడగఁ దెచ్చిరి హెగ్గడికత్తెలత్తరిఁ. 55

సీ. పగడంపుచాయల జిగిమించు మోవుల
సొంపుమీరిన పలుగెంపుగములఁ
జెక్కుటద్దంబుల చెలువుమీరుచు నున్న
గోటిజేరల పలునీటువగల

జాబిగొప్పున మీఁదఁ దీరుగాఁ గనుపించు
వాడిన నునువిరవాది సరుల
రాత్రెల్ల వేగింప రతిఁ జెందుబడలిక
వసివాళ్లువాడిన వదనములను

గీ. వింతసొగను వహింపుచు వేడ్క మదిని
వెలయ నొండొరుల్ తమతమవలువ లపుడు
మారువడఁ గట్టి యుల రతిమన్మథు లన
నేకశయ్య వారిర్వురు నెసఁగఁ జూచి. 56

క. అచ్చెరువందుచు వారలు
హెచ్చఁగ మదిలోనఁ గినుక యిరువురమీఁదన్
జెచ్చరఁ జేతులఁ జఱచుచు
వచ్చెనుగద! దూరటంచు వసరుచుఁ దమలోన్. 57

సీ. దివిజులకైనను దేరిచూడఁగ రాని
శోణితపుర మెట్లు! చొచ్చివచ్చెఁ
గావలివారలు కనకుండ నేరీతి?
నంతఃపురముఁ జేరె నందముగను
బాణనందనకు నీపార్థివసుతునకు
వియ్యమెట్టులు! గలిగె నెయ్యమమర
వీరున్న చందంబు వేడుకతోఁ జూడ
సంతోషమెట్లయ్యె? సకియలకును

గీ. నేమి మాయలుఁ బన్నెనో! యిందఱికిని
చొక్కుపొడిఁ జల్లెఁబోలు! నీసుదతిమీఁద
బాణునంతఃపురంబను భయము లేక
వీఁడు తానెట్లు? వచ్చెనే వెలఁదులార! 58

వ. అని మఱియును.

క. తలయూఁపుచుఁ దత్తఱపడి
తలఁపున నొకయింతయైనఁ దాలిమి లేకీ
చెలియున్న తెఱంగెల్లను
బలిపుత్రునితోడఁ దెలియఁ బలుకుద మనుచున్. 59

వ. గ్రక్కన బాణుసమ్ముఖంబునకు వచ్చి హెగ్గడికత్తియలు మ్రొక్కి యిట్లనిరి.

సీ. అసురేంద్ర! నీకన్యయంతఃపురంబున
వింత యొక్కటి బుట్టె వినుము నేఁడు
చిగురువిల్తునికన్న మిగులఁ జక్కనివాఁడు
వీరాధివీరుఁడై వెలయువాఁడు
బంగారుచాయల బాగుమీరినవాఁడు
సింహావలోకనశ్రీలవాఁడు
చెన్నుమీరుచునున్న చిన్నిపాఁగుమువాఁడు
జ్యాకిణాంకోరుభుజములవాఁడు

గీ. తమ్మిరేకుల గెల్చు నేత్రములవాఁడు
సోముని హసింపజాలు నెమ్మోమువాఁడు
వలమురినిఁ బోల్పఁజాలిన గళమువాఁడు
కొమరుమీరినయట్టి కొమరుఁడొకఁడు. 60

క. ఏపున మేమిందఱమున్
గాఁపుగ వాకిటనె యుండఁ గనకుండఁగఁ దా
నేపగిది? వచ్చినాఁడో
నీపుత్రినిఁ గూడినాఁడు నేర్పమరంగన్. 61

—: కోపావిష్టుండగు బాణాసుని యాజ్ఞచే దైత్యు లనిరుద్ధుని బంధింప నేగుట :—

సీ. అనవుఁడు గోపించి యసురేంద్రుఁ డవ్వేళ
నద్దిరా ! బలిపుత్రు నంతవాని
నగరుఁ బ్రవేశించి నడుమేడలోపలఁ
దగు నుషాకన్యకఁ దాను గూడి
తనకులంబునకు నెంతయు నిందఁగావించె
నదిగాక భయలేశ మైన లేక
నను సడ్డసేయ కింతయు నున్న చెల్వొంచ
నింత సాహసవంతు లేరి జగతి

గీ. ననుచుఁ బల్కుచుఁ గంటఁ గెంపతిశయిల్లఁ
బజ్జ మెలఁగెడు దనుజులఁ బారఁ జూచి
మీరు మీసాధనంబులు మెఱయఁ బూని
యమ్మహాబలుఁ బట్టితెం డనుచుఁ బల్కె. 62

క. దనుజాధీశుని పంపున
దనుజులు వివిధాయుధములుఁ దాలిచి వెస నీ
మనుజుని బట్టెడు పోదువం
డనుచుఁ హరిపౌత్రుఁ జేర నరిగిరి కినుకన్. 63

—: దైత్యబలములఁ జూచి యుష కలఁగఁగా ననిరుద్ధుఁడు ధైర్యము చెప్పుట :—

వ. అంత,

చ. ఘనముగ నార్పు లుప్పతిలఁ గైదువలున్ ఝళిపించి వచ్చునా
దనుజులఁ జూచి డెందమునఁ దద్దయు భీతిలి యాదురాత్మకుల్
తనపతి నేమిసేతురో! యుదగ్రత నంచును జింతఁ జెందు జ
వ్వనిఁ గని మందహాసమున వారిజనాభుని పౌత్రుఁ [1]డిట్లనెన్. 64

ఉ. ఇంత చలింపనేల? యిపు డేఁ గలుగంగ సమస్తదైత్యులున్
బంతము లాడుచున్ నడవ బాణుఁడు వచ్చిన సంగరంబునన్
ద్రుంతు జయంబుఁ జేకొనుదు దోర్బల మొప్పఁగ నీకు నిప్పుడే
సంతసమొప్పఁ జేయుదును సారసలోచన! నీవె చూడఁగన్. 65

గీ. అనుచుఁ దగఁ బల్కి యంకుశాహతినిఁ గినియు
గంధకరిలీల వెస లేచి కంతుసుతుఁడు
భయముచేతను వారించు పడఁతిమీరి
వీఁక దైత్యుల మార్కొనె విక్రమమున. 66

వ. ఆసమయంబున బాణపుత్రియగు నుషాకన్య మనంబున ఘనంబుగా భయంబుఁ జెంది తనసమీపంబుననున్న చిత్రరేఖం జూచి వజ్రపాణికైనం దేరిచూడఁగూడని యీబాణాసురుని బలంబుల కెదిరి యీయనిరుద్ధుం డెట్లు? జయంబుఁ జేకొను నని యడిగిన నుషకుఁ జిత్రరేఖ యిట్లనియె.

క. అనిరుద్ధుని లావెఱుఁగక
వనితా! మదిలోన నిట్లు వగవఁగ నేలా?
దనుజుల నందఱ నిప్పుడె
యనిమొన నిదె గెల్చివచ్చు నసహాయుండై. 67

వ. అని పల్కి.

1. డిటనున్.

ఉ. అత్తరిఁ జిత్రరేఖ సమరాళిని వేళభటాళిఁ జూచి తాఁ
జిత్తములో నిలింపముని శేఖరునిన్ దలఁపంగ నామునీం
ద్రోత్తముఁ డంతరిక్షమున నొయ్యన నచ్చటికేగి నిల్చి యో
చిత్తజపుత్ర ! నీకు జయసిద్ధి ఘటించు నటంచుఁ బల్కెనన్. 68

వ. తద్వాక్యంబు లాకర్ణించి చాల సంతోషించి యాయనిరుద్ధుండు నవ్వుచు దానవులఁ గని రోషభీషణుండగుచు సింహనాదంబు గావించి సౌధంబు డిగి రాఁగాఁ జూచి కొందఱు దైత్యులు కకావికలై చని రయ్యవసరంబున.

—: అనిరుద్ధుని పరాక్రమమునకుఁ దాళలేక దైత్యులు బాణాసురునికడకుఁ జేరుట :—

క. కరియూథంబులఁ గనుఁగొని
హరి యుద్ధతిమీర వచ్చు నాగ్రహ మునరన్
హరిపౌత్రుం డావేళను
యురులన్ గని సింహనాద మలరన్ జేసెన్. 69

సీ. అమరాంతకపౌత్రుఁ డంతఃపురద్వార
పరిఘంబుఁ గైకొని బలముమీర
రాకాశిమాఁకల పీఁకతో నొప్పింప
దానవుల్ మగుడ నుద్ధతివహించి
పరశుముద్గరగదాప్రాసపట్టిసముఖ్య
వివిధాయుధంబులు వేగఁ బరపి
తన్ను నొప్పించినఁ దగ సర్వభూతాత్ముఁ
డగుటను జెలియింప కవుడు సొరిదిఁ

గీ. ప్రళయజలదంబు గర్జించువగిది నార్చి
పగటిమార్తాండబింబంబుభాతి మిగుల
వేఁడిఁ జూపుచుఁ బరిఘంబు విసరి విసరి
దనుజబలములఁ బెక్కండ్ర ధరణిఁ గూల్చె. 70

మ. ఘనసంఘంబు ప్రచండవాతమున వేగ న్వ్రచ్చు చందంబునన్
ఘనదంభోళికఠోరఘోరపరిఘాఘాతంబునన్ నొచ్చి యా
దనుజానీకము బారఁ వెంటఁ జని యుత్సాహంబు రెట్టింప న
య్యనిరుద్ధుం డటఁ బోకు పోకుఁడు నిలుండంచున్ వెసన్
బల్కుచున్. 71

క. అలఘుపరాక్రమనిధియగు
వలరాయని సుతునిఁ జూచి పలుమరు వేడ్కన్
భళిభళి! యనుచును బొగడుచుఁ
గలహాశనమౌని యపుడు గంతులు వైచెన్. 72

క. హతశేషులైన దానవు
లతినిష్ఠురతేజుఁడైన యనిరుద్ధుసము
ద్ధతిఁ జూచి నిల్వనోపక
యతిరయమున బాణుకడకు నరిగిరి భీతిన్. 73

వ. అంత.

—: బాణుఁ డంతర్హితుఁడై పన్నగాస్త్రములచే ననిరుద్ధుని బంధించుట :—

సీ. ప్రజ్వరిల్లెడు హోమపావకుకై వడి
బాణుఁడు కోపసంభరితుఁ డగుచుఁ
దనమంత్రి యెదుట నుంచిన తేరిపై నెక్కి
ఖడ్గంబుఁ ద్రిప్పుచు గగనవీథిఁ

బరశుపట్టిసశూలపాశముద్గరకుంత
చక్రకార్ముకముఖ్యసాధనములఁ
గరముల వేయిని గరముఁ జెన్నువహించి
శక్రధ్వజంబులసాటిఁ బూన

గీ. విలుగుణధ్వనిఁ గావించి విక్రమించి
యట్టహాసంబు సేయుచు నతికఠోర
బాణవర్షంబుఁ గురియుచు భావభవుని
తనయు మార్కొని భుజబలోదగ్రుఁ డగుచు. 74

క. నిలునిలు మనుచును గన్నుల
బలుకెంపొదవంగ వాఁడిపలుకులుఁ బలుకన్
దెలియఁగ విని యనిరుద్ధుఁడు
కలఁగక బలిసుతుని మోముఁ గనుఁగొని నవ్వెన్. 75

చ. బలువగకిన్కచే వెలయ భానునికైవడి మీరి తేరిపై
విలసిలు బాణుఁ జూచి భయవిహ్వలయై యుష మేడలోపలన్
జెలువునిఁ జూచుచుండె నిక సేయుదు నేమని మూఢచిత్తయై
తలఁకుచుఁ జిత్రరేఖయును దద్దయుఁ జింతిలుచుండె నత్తరిన్. 76

సీ. కింకిణీరవములపొంకమై ర(తన)ంపు
బిరుదుటెక్కెంబులమురువుఁ బూని
వివిధశస్త్రాస్త్రముల్ వెలయ నొప్పువహించు
నరదంబుపై నెక్కి యనికిఁ బేర్చి
కరసహస్రంబుచేఁ గడుఁ దేజరిల్లుచు
నటవచ్చి నిల్చి బాణాసురుండు
నెలవంకగురుతుల నీటుఁ గాంచినవానిఁ
గలితాంగరాగుఁడై చెలఁగువాని

గీ. వాలుఁ బలకయు ధరియించి వఱలువానిఁ
పాదసంచారమున నుర్విఁ బ్రబలువాని
నఖిలభువనైకవీరు నయ్యదుకుమారుఁ
గాంచి కోపించి బాణుముడి కదుర నపుడు. 77

క. వివిధాయుధరహితుండును
గవచవిహీనుండు [1]వీనిఁ గంటిరె మీరల్
జవమలరఁ బట్టి తెండని
యవిరళగతి దనుజభటుల నాజ్ఞాపించెన్. 78

సీ. ప్రళయకాలమునాటి పటుమేఘబృందంబు
లాదిత్యుఁ గప్పిన యందమలర
ఖరదూషణాదిరాక్షసనాథయూథంబు
లారాముపై వచ్చు హరువుదోఁప
రహికెక్కు చైద్యజరాసంధముఖ్యులు
శ్రీకృష్ణుఁ బొదివిన చెలువుమెఱయ
గోగ్రహణంబునఁ గురుబలంబెల్లను
గాండీవిఁ గప్పిన క్రమముమీర

గీ. నపుడు దైతేయులాగ్రహవ్యగ్రు లగుచు
బహువిధాయుధహస్తులై ప్రబలి మిగులఁ
గారుచిచ్చును మిడుతలు గవిసినట్లు
శూరుఁడౌ ననిరుద్ధునిఁ జుట్టుకొనిరి. 79

మ. అనిరుద్ధుండును రోషభీషణతరాహంకారహుంకారుఁడై
దనుజానీకముఁ జేరిచూచి నగుచున్ దర్పంబుమీరన్ గదున్
దునియల్గాఁ బడ వ్రేయ నద్దనుజులన్ దుర్వారఖడ్గంబుచే
ననికిన్ జాలక పారి రందఱును హాహాకారముల్ మీరఁగన్. 80

1. వీఁడు.

వ. ఇవ్విధంబున వెఱపునం బాఱి మఱుఁగుఁ జొచ్చిన నిశాచరుల
నూఱడించి బాణుండు తనయురదంబు సమ్ముఖంబు సేయించి.

క. తన వేయికరంబులచే
వినుతిగ ధరియించినట్టి వివిధాయుధముల్
గనుఁగొనలఁ గెంపు నింపుచు
ననిరుద్ధునిమీఁద వైచె నాగ్రహ మొదవన్. 81

క. ఈరీతి బాణుఁ డేసిన
భూరిశరంబులను గేడెమున నేర్పొదవన్
వారింపుచు ననిమొన నా
శూరుఁడు విలసిల్లె నుదయసూర్యనిభంగిన్. 82

గీ. గంధగజమును బరికించి కాననమున
సరకుగొననట్టి సింహంబుకరణి మఱియు
లేశమైనను దైత్యేంద్రు లెక్కగొనక
సమరముఖమునఁ బొల్చె నాశౌర్యధనుఁడు. 83

వ. ఇట్లు నిలిచిన.

సీ. బాణుఁ డంత నిశాతబాణజాలంబుల
గఱులంటగా నేసి గాత్రసీమ
మర్మముల్ నొప్పింప మగటిమి చెడక యా
యనిరుద్ధుఁ డాగ్రహ వ్యగ్రుఁ డగుచు
నిఖిలాంగకంబులు నెత్తుట జొత్తిల్లఁ
గావించి విశిఖసంఘముల నొంచి
యసురేంద్రు తేరుపై కనుగ నారణకోవి
దుండు ఖడ్గంబులఁ దోమరముల

గీ. సునిశితములైన ముద్గరశూలచక్ర
పరశుపట్టిసముఖఘనప్రహరణముల
నిఖిలజగములు కంపింప నిగుడఁజేసి
మించి ప్రద్యుమ్నతనయుని ముంచె మఱియు. 84

గీ. బాణుఁ డీరీతి నొప్పింప బాణతతులఁ
గలఁగ కాతఁడు తనచేతిఖడ్గమునను
వానిరథకూబరముఁ ద్రుంచి పూనికలర
హయములను ద్రుంచి బెట్టేర్చె నతిశయమున. 85

క. ఈరీతి విక్రమంబున
మీరిన యనిరుద్ధుఁ జూచి మేల్మే లనుచున్
భూరిముదంబునఁ బొగడుచు
నారదుఁ డట నిల్చి నింగి నాట్యముఁ జేసెన్. 86

క. ఎంతయుఁ గినుకను బాణుఁడు
పంతముమీరంగ వివిధబాణంబులచేఁ
గంతునికొడుకును ననిలో
నంతర్హితుఁజేయ దనుజు లార్చిరి పెలుచన్. 87

సీ. అనిరుద్ధుఁ డవియెల్ల నడిదంబుచేఁ ద్రుంచి
కోపించి తన్ను మార్కొన్న వాఁడు
కాలదండమురీతిఁ గాలాగ్నికైవడి
మిక్కిలిఁ దీవ్రమౌ నొకశక్తి
జగములు కలఁగంగ జ్వాలలు నిం[1]డంగ
ఘంటలు మ్రోయంగఁ గాంతి చెలఁగఁ
బ్రద్యుమ్ననందనుపైఁ బ్రయోగించిన
నలశక్తియే పూని యాఘనుండు

1. నిడుంగ.

గీ. బలితనూభవుమీఁదను భయదముగను
వడిఁ బ్రయోగింప నది వచ్చి వానిరొమ్ము
భూరిజవమున భేదించి భూమిఁ జొచ్చె
నపుడు దేవత లార్చిరి యంబరమున. 88

వ. అయ్యవసరంబున రణంబున మూర్ఛాగతుండై నతరి బాణునిఁ
జూచి కుంభాండిట్లనియె.

ఉ. ఓ యసురేంద్ర! వీని నని నోర్వఁగ నీకు నశక్య మీజగ
ద్గేయపరాక్రముండు రణకేళివిశారదుఁ డట్లుగావునన్
ధీయుతమూర్తివై యిపుడు తీవ్రరణంబటు గట్టిపెట్టి నీ
మాయను నొంచి వీని నిట మమ్మును నిన్నును గావఁగాఁ దగున్.

గీ. అనుచుఁ గుంభాండుఁ డాడిన నసురవిభుఁడు
తెలివిఁ గైకొని ఘనకోపదీప్తుఁ డగుచు
మించి గరుడుండు పామును ద్రుంచుకరణి
వీని ఖండింతు ననుచును బూని పలికి. 90

క. హరులును గేతువు సారథి
యరదంబునుగూడ బాణుఁ డంతర్హితుఁడై
యరిగిన యాహరిమనుమఁడు
వెరవక నలుదిశల వాని వెదకుచు నుండెన్. 91

సీ. బలిపుత్రుఁ డప్పుడు బలుమాయచేతను
దను గానరాకుండ ధరణి నిల్చి
యనిరుద్ధు నయ్యెడ నతిఘోరతరములౌ
పన్నగాస్త్రంబుల బద్ధుఁ జేసి

తన కేతుదండంబుఁ దనర నానుకనిల్పి
పరుషవాక్యంబులుఁ బలికి మిగుల
మనమునఁ గోపంబు (మలయుచు నుండం)గఁ
గుంభాండుఁ జూచి యాకులవిదూరుఁ

గీ. [1]గాదవ మెన్నఁడు లేని యీ కులమునకును
నిందఁ దెచ్చిన వీనిని నీవు వేగ
యింపుమీరంగ నిపుడ హింసింపు మనిన
నసురవిభుఁ జూచి మంత్రి యిట్లనియె మగుడ. ౯౭

—: బాణాసురుఁ డనిరుద్ధుని జంప నాజ్ఞాపింపఁగాఁ గుంభాం
డుండు వారించుట :—

ఉ. ఓరజనీచరేంద్ర! హిత మొక్కటిఁ జెప్పెదఁ జిత్తగింపు మే
తీరున? వచ్చె వీఁ డిటకుఁ దేఁకువ నెవ్వరు? తోడితెచ్చిరే
యూరు? కులంబు? వీని కని యోర్పు మరంగ వివేకశాలివై
యారసి పిమ్మటన్ దగు నుదగ్రతరంబుగఁ దెంపుసేయుఁగన్. ౯౮

సీ. శుక్రున కెనయైన శౌర్యంబుఁగలవాఁడు
ఘనభుజాబలముచేఁ దనరువాఁడు
నిఖిలాస్త్రములయందు నేర్పుఁగల్గినవాఁడు
భానుతేజంబుచేఁ బరఁగువాఁడు
కమనీయశృంగారగరిమఁ జెన్నగువాఁడు
నలరువిల్తునిరీతి నలరువాఁడు
రాజలక్షణములరమణఁ గాంచినవాఁడు
చిన్నిప్రాయంబునఁ జెలఁగువాఁడు

---

1. గాదర యున్నదును లేని కులమునకును,

గీ. బవరమునఁ జేరి దేవదానవులకైన
గెలువరానట్టి మగటిమిఁ గలుగువాఁడు
కరసహస్రంబుగల నిన్ను కలన నోర్చి
వరబలోన్నతిఁ జెలువొందువాఁడు వీఁడు. 94

వ. ఏవంవిధగుణగరిష్ఠుండైన యీపురుషశ్రేష్ఠుండు మాన్య యగు నీకన్య గంధర్వవివాహంబున వరియించెఁ గావునఁ బూజార్హుండు గాని వధార్హుండుగాఁడని వినయంబు నయంబు ప్రియంబు మీఱఁగాఁ బల్కు కుంభాండు వాక్యంబు లంగీకరించి(పాశ) సమేతునిగా ననిరుద్ధుఁ గావలిబెట్టించి మంత్రియుం దానును బాణుఁడు నిజనివాసంబునకుం జనియె నంత.

—: అనిరుద్ధుఁడు దుఃఖితయగు నుషాకన్యను సమాశ్వాసపఱచి దుర్గాస్తవమున గతబంధనుండగుట :—

క. నారదచోదితుఁ డగుచును
వారిజనయనుండు వచ్చు వాలాయము నీ
క్రూరునిఁ ద్రుంచు నటంచు ను
దారతఁ బ్రద్యుమ్నసుతుఁడు తలఁచుచు నుండెన్. 95

ఉ. పన్నగపాశబద్ధుఁడగు ప్రాణవిభున్ బరికించి గాటమౌ
విన్నదనంబునన్ మొగము వేఁకువచంద్రునిరీతి నొప్పఁగాఁ
గన్నులబాష్పపూరములు గబ్బిచనుంగవమీఁద జాఱఁగాఁ
గన్నియ నెమ్మనంబు కలఁగన్ గడుఁ జింత వహించె నత్తఱిన్. 96

వ. ఇట్లు దుఃఖితయగు నుషఁ జూచి యనిరుద్ధుం డిట్లనియె.

ఉ. కన్నియ! దైన్య మొందకుము కమ్రకరాంచితశంఖచక్రుఁ డా
వెన్నుఁడు వచ్చు నాఁటఱకు వేగమె దైత్యులఁ ద్రుంచు నాజిలో
నిన్నును నన్ను దోడ్కొనుచు నెమ్మిని ద్వారకఁజేరుఁ గమ్మరన్
జెన్నువహింపగా మనకుఁ జేకుఱు భాగ్యము లెల్లకాలమున్. 97

క. అని వనిత నూఱడింపుచు
ఘనమగు దుర్గాస్తవమున గతపన్నగబం
ధనుఁ డగుచు నతిముదంబున
ననిరుద్ధుం డుండె దనుజునంతిపురమునన్. 98

క. నారదుఁ డావృత్తాంతము
వారిజనాభునకుఁ దెల్పువాఁడై నింగిన్
భూరిజవంబున మీఱుచు
ద్వారవతీపురికి నేగె వాంఛ దలిర్పన్. 99

—: ద్వారకాపురమున - స్త్రీలనిరుద్ధుని మేల్కొల్పఁజనుట ;
అంతఃపుర స్త్రీ లనిరుద్ధుని గాన కెల్లెడల వెదకి తుదకు
శ్రీకృష్ణున కెఱుకపఱచుట :—

వ. అంత.

సీ. అరుణోదయంబున హరిపౌత్రు మేల్కొల్ప
నెప్పటిక్రమమున నిందుముఖులు
పడకయింటికి వచ్చి బాగుగా నెంతయుఁ
దంబురల్ సుతిఁగూర్చి తనరు వేడ్క-
దేవగాంధారియు దేశాక్షి మలహరి
గుండక్రియ లలిత గుజ్జరియును
మొదలుగాఁ గలయట్టి యుదయరాగంబులు
వినుతింపఁ గొందఱు వింతవగల

గీ. సద్దమును క్షీరకుంభంబు లలరుసరులు
కామధేనువు మున్నుగాఁ గల్గుభవ్య
వస్తువులతోడ శోభనవాద్యములును
బూని కాచిరి కొంద ఱంభోజముఖులు 100

సీ. పడకింటిలోపలఁ బవళించి యున్నట్టి
కాంతలు మేల్కాంచి కంతుతనయుఁ
డేరేయి యిక్కడ నెలమితోఁ గ్రీడించి
మనల వంచించి యేమగువకడకొ
చని దానితోఁ గూడి సంతోషమమరంగ
బడలిక నెమ్మనఁ బొడమ నిపుడు
నారార ! యుదయమైనదియును నెఱుఁగక
యూరక నిదురింపుచున్నవాఁడొ !

గీ. పురిని గల వారయువతులపొందుఁ గోరి
మదనకేళికి నలయుచు నిదురఁబోయి
తెల్లవారినకతమున నుల్లమునను
సిగ్గుపడి రాకయున్నాఁడో ! చెలువలార ! 101

క. ఇచ్చకములాడి మిక్కిలి
విచ్చలవిడి గొల్లచెలుల వేడుకమీరన్
దచ్చనలఁ గూడి జాణగాడు
నచ్యుతునకు మనుమఁ డనిన నడుగఁగ నేలా. 102

క. అని యనిరుద్ధుని నింతులు
మనమున నెన్నుచును మిగుల మమతలు హెచ్చన్
వనితలయిండ్లను వెదకఁగ
ననఁబోఁడులఁ బంపి రపుడు నవ్వుచు నంతన్, 103

క. ఇల్లిల్లు వెదకి యప్పుడు
తెల్లమిగాఁ దెలిసివచ్చి తెఱవలు తెలుపన్
గొల్లల నగ్గడికత్తెల
వల్లభుఁ డచ్చోట నున్నవాఁడని తెలియన్. 104

వ. దిగ్గన వచ్చి యగ్గడికత్తియలు బద్ధాంజలులై యయ్యనిరుద్ధుని కులసతులతో నిట్లనిరి.

ఉ. ఇంతులు గొల్లఁ జుట్ల దొర యిక్కడనే కొలువుండఁ గంటి మే
మంతిపురంబు దాఁటి విభుఁ డవ్వలి కేగఁగఁ గాన మేమియున్
వింతగు చిక్కుబీగములు వేసినయట్లనె యున్న విప్పుడున్
గంతునిపట్టి యిట్లరుగఁ గారణమేమియొ! సోద్య మయ్యెడిన్.

వ. అని మందలించిన నయ్యిందువదనలు తమలోఁ దా మిట్లనిరి.

సీ. బాళితో రమణుండు భామ! రమ్మని పిల్చి
విరులుఁ గొప్పునఁ జుట్టె వింతగాఁగఁ
దమితోడ నాథుండు తరుణి! రమ్మని పిల్చి
పుక్కిటివిడె మిచ్చె బుజ్జగించి
యెలమిమీరఁగఁ బతి యెలనాగ! రమ్మని
తిలకంబు దిద్దెను దీరుగాఁగఁ
బ్రేమతోఁ జెలువుండు బిత్తరి! రమ్మని
కౌఁగిటఁ జేర్చెను గారవించి

గీ. యోరి! రమ్మని నేఁ బిల్వ నొఱపుమీరఁ
బలికె సేబా సనుచు మెచ్చి బాగుమీర
సమరతుల నన్ను దేలించి సరసమమర
సురఁటిచేతను విసరెను సుదతులార! 106

క. నవ్వులకును మనతోడను
బువ్వులవిలుకాని సుతుఁడు పొంకముగాఁగన్
దవ్వుల డాఁగఁగఁబోలును
జవ్వనిరో! వెదుకుదాము సరసత ననుచున్ 107

సీ. మేలుగాఁ గనుపట్టు కేళీగృహంబులు
గొప్పలై మించిన యుప్పరిగెలుఁ
జెలువంబు మీరిన శృంగారవనముల
నింపైన పూఁబొదరిండ్లయందు
నవరత్నవిరచితనాటకశాలల
సౌవర్ణమయములౌ సజ్జలందు
నెలమిఁ గ్రీడించు నింతుల యిండ్ల(యందు)ను
మెచ్చంగఁదగు మేలుమిద్దెలందు

గీ. వెలఁదు లందఱు గుంపులై వెదకి వెదకి
కంతు తనయుని గానక కళవళమున
నచ్చెరువుఁ జెందుచును జాల నాత్మలోనఁ
బలికి రిట్లని యెంతయు భావమలర. 108

చ. మునుపును శంబరాసురుఁడు ముచ్చుతనంబునఁ బంచబాణునిన్
గొని తనయింటి కేగె నని క్రొత్తలుగా వినుచుందు మిట్టిచో
ననిమొన నోర్వఁజాలమిని యచ్చెరువొందఁగ నెవ్వఁడేనియున్
మనసిజసూను నెత్తుకొని మాధవునిన్ గనకుండ డాఁగెనో! 109

వ. అని యింతులెల్ల యోజనసేయుచు దగ్గఱనున్న హెగ్గడి కత్తియలతో నిట్లనిరి.

క. హరితోడుత నీకార్యము
సరగున నిందఱును దెల్పి సంతసమమరన్
వరుసన్ దోడ్కొని రమ్మని
గరితలకును మ్రొక్కి వారు కదలిరి వేగన్. 110

వ. అంత.

క. కమలంబులు వికసించెను
గమలాప్తుం డుదయమయ్యె గౌరవమొప్పన్
గమలాక్ష! మేలుకొను మని
కమలముఖులు మేలుకొలుపఁ గడువేడుకతోన్. 111

సీ. హరియప్డు మేల్కాంచి యద్దంబుఁ బువ్వులు
కపిలధేనువు క్షీరకలశములను
విప్రయుగ్మంబును వేడుక వీక్షించి
నిత్యకృత్యముఁ దీర్చి నేమమమరఁ
బసిఁడికంబంబుల భాసిల్లుచున్నట్టి
కొలువుకూటంబునఁ గోమరుమీరఁ
జెలఁగెడు నవరత్నసింహాసనంబునఁ
గొలువున్నసమయంబుఁ జెలులు దెలిసి
గీ. విన్నవింపఁగఁ బదియాఱువేలు సతులు
నల్ల రుక్మిణిమొదలైన యష్టమహిషు
లెలమిమీరఁగ శ్రీకృష్ణుఁ గొలువ నపుడు
వచ్చి రచటికిఁ దమతమ వైభవముల. 112

వ. అంత.

సీ. అలరుక్మిణీదేవి యందంబు కనుపట్ట
నిలువుటద్దముఁ బట్టె నేర్పు మెఱయ
భామినీమణి సత్యభామ సిగ నమర్చి
బురు(సారు)మాల్ గట్టెఁ బొంకముగను
జాంబవతీసతి జాతికస్తురిచేతఁ
దిలకంబు దిద్దెను దీరుగాఁగ
మిత్రవిందాకాంత మేలైనచౌకట్లు
వీనులఁ గీలించె వింతగాఁగఁ

గీ. కంఠమున భద్ర నిలిపెను గంఠసరులు
నురమున సుదంత కౌస్తుభ మొప్పు నుంచెఁ
జనవునఁ గళిందకన్య చేసరు లమర్చె
బిరుదుపెండెంబు లక్షణ పేర్మిఁ బెట్టె. 113

వ. మఱియును.

సీ. పొలుపుమీరినయట్టి బురుసాహిజారును
దొయ్యలి యొక్కతె తొడగనిచ్చెఁ
బసిఁడిద్రావాఁత చెఱంగు మిసిమిగల్గిన దట్టిఁ
దరుణి యొక్కతమర్చె హరువుగాఁగ
రంగుమీరినయట్టి బంగారుదుప్పటిఁ
బడఁతి యొక్కతె కట్టె బాగు మెఱయఁ
బంచరత్నంబుల భాసురంబగు వంకి
సుదతి యొక్కతె చెక్కె సొగసుమీరఁ

గీ. చేరి యుడపంబుఁ గట్టెను చెలువ యొకతె
కడఁగి కాళంజిఁ బూనెను గాంత యొకతె
సురఁటిచేతను విసరెను సుదతి యొకతె
వెలయ వింజామరముఁ బూనె వెలఁది యొకతె. 114

క. చెలు లంద ఱిట్లు గొల్వఁగ
మలయు కరేణువులనడిమి మత్తేభ మనఁ
జెలువొందెదు గోపాలకు
నెలమిఁ వీక్షించి మ్రొక్కి హెగ్గడికత్తెల్. 115

క. చనవరులగు గరితలతో
ననిరుద్ధుని గాన మనుచు నక్కఱమీఱఁ
వినయంబుతోడఁ దెల్పిన
వనజాక్షున కెఱుకసేయ వారలు నంతన్. 116

వ. మందస్మితసుందరవదనారవిందుండై గోవిందుండును.

క. ఏలా మీకీయోజన
వాలాయముగాఁగఁ బంచబాణునిసుతు నే
నేలీలనైనఁ దెచ్చెద
బాలికలకుఁ దెలుపుఁ డనుచుఁ బనిచెన్ వారిన్. 117

—: శ్రీకృష్ణుఁ డాస్థానమును జేరి సకల పరివారములను రప్పించి యనిరుద్ధుఁడు కానరాకుండుటను దెల్పుట :—

వ. ఇవ్విధంబున హెగ్గడికత్తియలకు నానతిచ్చి యగ్గజరాజవరదుండు దగ్గఱను నున్న యన్నగారలఁ జూచి దారకునిఁ దేరుఁ దెమ్మనుండని పనిచిన యనంతరంబ.

ఉ. సారథి తేరుఁ దెచ్చె నని సారసనేత్రులు విన్నవింప నా
నీరజనాభుఁ డొద్దితరుణీతతి హెచ్చరికంచుఁ దెల్పఁగా
మేరువుకై వడిన్ దిశల మిక్కిలిఁ గాంతులు నించి మించు న
త్తేరవు డెక్కి వచ్చె నతితీవ్రగతిన్ సభఁ జేర వేడుకన్. 118

వ. ఇవ్విధంబున సుధర్మాస్థానంబునకుఁ వచ్చి యచ్యుతుండు అచ్చటఁ గొలు విచ్చి కూర్చుండి దండనుండు నవసరంబుల బంధుపరిజనంబుల మంత్రివరుల గుఱిదొరల రప్పించుమండని యానతిచ్చిన.

క. అవసరమువార లప్పుడె
జవమునఁ జని దొరలకెల్ల సరగునఁ దెల్పఁ
సవరణలు మెఱయ వచ్చిరి
సవిరళగతి నుగ్రసేనుఁడాదిగ సభకుఁ. 119

వ. మఱియును.

సీ. తనయుఁ డేకార్యంబుఁ దలఁచినాఁడో! యని
వసుదేవుఁ డటవచ్చె వాంఛమీఱ
ననుజుఁ డెవ్వని గెల్వ నాత్మ నెంచెనొ! యని
నీలాంబరుఁడు వచ్చె నెమ్మిమెఱయ
నని గల్గెనో! తమయన్నకు నని యెంచి
సాత్యకి వచ్చెను సరభసముగ
నయ్య పిల్పించిన యవసరంబేమని?
ప్రద్యుమ్నుఁడును వచ్చె బలము గొలువ

గీ. మఱియు నుద్ధవముఖులైన మంత్రివరులు
పరఁగఁ గృతవర్మ మొదలైన బంధువులును
నల్లయక్రూరుఁడాదిగా నాప్తజనులు
వచ్చి రాశౌరిసభఁ జేర వరుసగాఁగ. 120

వ. తదనంతరంబు.

క. వచ్చినవారికి నప్పుడ
యచ్యుతుఁ డెదురేగి మిగుల నందముగాఁగన్
మచ్చికఁ దండ్రికి నన్నకు
ముచ్చట మీఱంగ మ్రొక్కి మోదము వెలయన్. 121

క. వసుదేవప్రముఖుల నల
బిసరుహలోచనుఁడు హేమపీఠంబులపైఁ
బొసఁగఁగ నిల్పుచు మది కిం
పెసఁగంగా వారిఁ జూచి యిట్లని పల్కెన్. 122

సీ. వింత యొకటి నేఁడు వినరయ్య దొరలార!
యరయ నిన్నటిరేయి యంతిపురము
బీగముద్రలున్నైన పిదపను నిదురించు
ననిరుద్ధుఁ గానమం చతివ లనిరి
యిది యేమి హేతువో? యిందఱు యోజించి
తెలియఁబల్కు డటన్నఁ దేటగాఁగ
విని వారు మిక్కిలి విస్మయంబందుచు
ముందుఁ దోఁచక శౌరిమోముఁ జూచి

గీ. జగతి సర్వంబుఁ దెలిసిన స్వామివీవ
నీకుఁ దెలియనిదేమి? యీ శోకములను
మమ్ము నడుగంగ నేలయ్య? మదన జనక!
తెలియ మీరలె యిపు డానతీయవలయు. 123

వ. అనిన విని కపటనాటకసూత్రధారుండైన శౌరి సర్వంబునుం దెలిసియుఁ దెలియనివానిచందంబున డెందంబున యోజన సేయుచున్న సమయంబున,

—: నారదుఁడు శ్రీకృష్ణునికి ననిరుద్ధుని వృత్తాంతమును బాణా
సురుని బలమును దెలుపుట :—

ఉ. తెల్లనిమేనిపై నలరుతేజము దిక్కులఁ బిక్కటిల్లఁగా
గొల్లలయేలికైన హరిఁ గోరికఁ బాడుచు వీణ మీటుచున్
బల్లిదుఁడై చరించు నల బాణుని గర్వ మణంచ నెంచి తా
మెల్లనె నారదుం డపుడు మేదినికిన్ దిగివచ్చె వేడుకన్. 124

క. ఇల కిటువలె దిగివచ్చిన
కలహాశనమౌని పాదకమలంబులకున్
వలగొని మ్రొక్కుచు శౌరియుఁ
జెలువగుసద్భక్తిఁ బూజసేయుచు మిగులన్. 125

సీ. మౌనీంద్రుఁ డోడ్డెచ్చి మణిపీఠమున నుంచి
యతని యనుజ్ఞచే నపుడు హరియు
సింహాసనంబునఁ జెలఁగుచుఁ గూర్చుండి
కుశలంబు లడిగినఁ గోర్కిమీర
ధర మీ రవతరించి ధర్మంబుఁ బోషింప
సర్వంబు కుశలంబె స్వామి! యనినఁ
దాపసోత్తమునకుఁ దనర నంజలిసేసి
యనిరుద్ధువృత్తాంత మడుగ నితఁడు

గీ. పరఁగు బ్రహ్మాండముల నెల్ల బాగుమీర
గర్భమున నుంచుకొన్నట్టి ఘనుఁడ వౌర!
యిట్టి వృత్తాంత మేమియు నెఱుఁగనట్లు
లడిగెదవు నీ వెఱుంగని యదియుఁ గలదె! 126

సీ. బలితనూభవుఁడగు బాణాసురునిపుత్రి
కలలోన యనిరుద్ధుఁ గలసి వేడ్కఁ
జిత్రరేఖను జూచి చెలువునిఁ దెమ్మన్న
నళినాక్షి మాయచే నగరుఁ జొచ్చి
యనిరుద్ధుఁ దోడ్కొని యప్పురంబున కేగి
యల యుమతోఁ గూర్చినట్టి వార్త
బాణాసురుఁడు విని బలములతో వచ్చి
పన్నగాస్త్రంబులఁ బదిలముగను

గీ. బంచబాణునితనయుని బద్ధుఁ జేసి
బయలు దేఱకయుండఁగఁ బ్రబలు లైన
యట్టి దనుజులఁ గావలిఁ బెట్టినాఁడు
మనుమ నిటు దోడితెమ్ము నీమహిమ మెఱయ. 127

వ. అని పల్కిన.

సీ. బలభద్రుఁ డప్పుడు పంతంబు లాడుచు
ముసలంబుఁ ద్రిప్పెను మొక్కలమున
సమరంబులో దైత్యు సమయఁ జేయుదు నంచు
సాత్యకి లేచెను సంభ్రమమునఁ
బట్టిలిఁ జెఱపట్టు ప్రబలుఁడౌ దానవుఁ
బట్టితెచ్చెద ననెఁ బంచశరుఁడు
బాణునిఁ గూల్చెద బాణాగ్నిచే నని
సాంబుండు పలికెను సాహసమున

గీ. మఱియుఁ గృతవర్మ మొదలైన మనుజపతులు
శోణితపురంబునను గల్గు శూరవరులఁ
జెండుచెండాడి మిక్కిలిఁ జేవమెఱయ
వల్ల యనిరుద్ధుఁ దోడ్తెత్తు మనుచుఁ బల్క, 128

క. వీరలాపము లాడెడు
వారల వారించి యపుడు వసుదేవసుతు౯
జేరఁగ రమ్మని ప్రేమను
నారదుఁ డిట్లనుచుఁ బల్కె నైపుణిమీరఁగ౯. 129

సీ. ముల్లోకములు మెచ్చ ముక్కంటిచేతను
వరములఁ గైకొన్న వరబలుండు
వేయికరంబుల వివిధాయుధంబులు
ధరియించి యనిసేయు ధైర్యశాలి
దేవేంద్రముఖులైన దిక్పాలకుల నెల్ల
క్షణమాత్రమున గెల్చు సాహసికుఁడు
మాయాబలంబున మగటిమిచేతను
జగతుల సాధించు బల్లిదుండు

గీ. ప్రమథగణములతోఁగూడ భర్గునంత
వాఁడు వాకిటిగొల్లయై వచ్చికొలువ
నల్ల శోణితపుర మేలునట్టి మేటి
యమితతేజోధికుండు బాణాసురుండు. 130

గీ. జగములన్నియు సృజియింప సాకఁ ద్రోవఁ
జతురుఁడవు నీకు నింక నసాధ్యమేమి ?
వీరుల కసాధ్యుఁ డగునె యువ్వీరవరుఁడు
నీవె గెలువంగవలయును నేర్పుమీర. 131

వ. అని విజయప్రయాణంబునకు శుభముహూర్తంబు నిర్ణయించిన.

క. అరుణాబ్జనాయికాంబా
చరణాంబుజసాధుభజనసంభృతహృదయా !
నిరతాన్నదానపోషిత
ధరణీసురవర్య ! శాశ్వతశ్రీధుర్యా ! 132

క. సాక్షాత్కృతకనకవనా
ధ్యక్ష! విపక్షావనీంద్రదారణదక్షా!
అక్షయకరుణావీక్షణ
రక్షితకవిరాజ! దినకరప్రియతేజా! 133

రథోద్ధతవృత్తం.

అంగనాహృదయహారిసత్కృపా
పాంగవీక్షణ! కృతార్థసద్గుణా!
సంగరాపహృతశాత్రవౌఘమా
తంగబృందభరితశ్రితాంగణా! 134

గద్య. ఇది శ్రీమద్రాజగోపాలకరుణాకటాక్షవీక్షణానుక్షణప్రవర్ధమాన సారసారస్వతధురీణయు విచిత్రతరపత్రికాశతలిఖతవాచికార్థావగాహనప్రవీణయు తత్ప్రతిపత్రికాశతస్వహస్తలేఖనప్రశస్తకీర్తియు శృంగారరసతరంగితపదకవిత్వమహనీయమతిస్ఫూర్తియు అతులితాష్టభాషాకవితాసర్వంకషమనీషావిశేషశారదయు రాజనీతివిద్యావిశారదయు విజయరాఘవమహీపాలవిరచితకనకాభిషేకయు విద్వత్కవిజనస్తవనీయవివేకయు మన్నారుదాసవిలాసనామమహాప్రబంధనిబంధనకృతలక్షణయు మహనీయరామాయణభాగవతభారతకథాసంగ్రహణవిచక్షణయు పసపులేటి వెంకటాద్రిబహుజన్మతపఃఫలంబును మంగమాంబాగర్భశుక్తిముక్తాఫలంబును రంగద్గుణకదంబయు నగు రంగాజమ్మ వచనరచనాచమత్కృతిం జెన్నుమీరు ఉషాపరిణయంబను మహాప్రబంధంబునందుఁ ద్వితీయాశ్వాసము.

—: శ్రీరాజగోపాలాయనమః :—

శ్రీ రాజగోపాలాయనమః

# ఉషాపరిణయము

(పద్యకావ్యము)

## చతుర్థాశ్వాసము

-:శ్రీకృష్ణుఁడు సపరివారముగా బాణునితో యుద్ధమునకుఁ జనుట:-

క. శ్రీమహితరాజగోపకృ
పామహిమప్రాప్తపుత్రపౌత్ర! జయశ్రీ
ధామ! సుగుణాభిరామా!
రామాసుమచాప! విజయరాఘవభూపా! 1

వ. అవధరింపుము.

గీ. అపుడు కృష్ణుండు విప్రపుణ్యాహఘోష
పూర్వకముగాఁగఁ గదలుచోఁ బురయువతులు
చల్లతావులుఁగల విరుల్ జల్లి రెలమి
మ్రోసె వాద్యము లాశౌరి ముదముఁ జెంద. 2

గీ. ఇట్లు బాణజయార్థమై యేగునట్టి
హరిని గనుఁగొని నారదుం డనియె నిట్లు
ఓయదూద్వహా! వేగ తార్క్ష్యుని దలంపు
తత్స్మర మతఁడు నొకముహూర్తమునఁ జేర్చు. 3

క. ఖగకులనాథుఁడు దక్కఁగ
నొగి నేకాదశసహస్రయోజనములుఁ దా
మగటిమిఁ జని యతిదుర్గమ
మగు శోణపురంబుఁ జేర్చె నన్యుల కగునే. 4

చ. అన విని కంసమర్దనుఁడు నట్లన నెమ్మదిలోఁ దలంచునం
తన వినతాతనూభవుఁ డుదారగతిం జనుదెంచి యచ్యుతుం
గని వినయావనమ్రుఁడయి గ్రక్కునఁ బార్శ్వమునందు నిల్చి య
య్యనఘునకుఁ బ్రమోదముగ నంజలిబంధముఁ జేసి యిట్లనెన్. 5

సీ. దనుజభంజన ! నన్ను దలఁచిన పని యేమి ?
యానతియిమ్ము నెయ్యంబు మీఱ
భవదీయబలగుప్తపతివిక్షేపంబు
చే నెవ్వనిపురంబు ? వో నడంతు
మీఱ చేపట్టిన మేలిమిచేఁ బాంచ
జన్య చక్రంబులు శార్ఙ్గగదలు
మొదలైన యాయుధంబుల దర్పమునకు నా
దర్పోద్ధతికి నసాధ్యంబు గలదె !

గీ. యనుటయును శౌరి యాదరాయత్తదృష్టి
నతని వీక్షించి వినుము ఖగాధినాథ !
బలితనూభవుఁడగు బాణుఁ డలఘుశక్తి
గర్వదుర్వారపిశునతాఖర్వుఁ డగుచు. 6

గీ. కదనమునఁ గిట్టి తనబలమదము నెల్ల
మాయఁ జేసిన యనిరుద్ధు మాయఁ జేసి
నాగపాశబద్ధునిగా నొనర్చినాఁడు
తెలియఁడో ! శాక భవదీయతీవ్రశక్తి. 7

క. అటు గనుక దూరమగు త
త్పుటభేదన మిపుడ చేరఁబోవలయుట ని
న్నిటుదలఁచితి మదియు సము
ద్భటుఁడగు నీవలనఁ గాక పరుచే నగునే. 8

వ. అది యెట్లంటేని.

మ. పటుజంఘాలభవద్గరున్మరుదురుభ్రామ్యన్మహాయోధముల్
జటులాదిత్యగణంబు వే గెలిచి తత్సంపాదితంబౌ యశః
పటలింబోలు సుధన్ హరించి యతులప్రఖ్యాతిచేఁ దల్లి యు
త్కటదాస్యంబును బాయఁజేసిన మహాధన్యుండ వీవెంచఁగన్. 9

వ. అదియునుంగాక.

క. కడఁకమయి సురల వీఁకున
నిడికొని యసురుల జయించి హెచ్చగు జయముల్
బడిబడి నొసఁగు ఘనుండవు
సుడివడరే రిపులు నిన్ను జూచినయంతన్. 10

ఉ. నీవు మహానుభావుఁడవు నిత్యము మద్రథకేతనాకృతిన్
శ్రీవి వహించినాఁడవు గణింపఁగ యాదవులెల్ల నిన్ను సం
భావన చేయుచుందురు రపారపరాక్రమధుర్య! యెప్పుడున్
గావున నిట్టికార్యముఁ దగన్ నెరవేర్పుము నేర్పుపెంపునన్. 11

క. అని మధుసూదనుఁ డాడిన
విని భుజగాశనుఁడు హర్షవిస్మయములు నె
మ్మనమునఁ బెనఁగొన హరిఁ జే
ర్కొని యిట్లని విన్నవించె గురుతరభక్తిన్. 12

మ. ఇటు లాడఁగా దగునయ్య! మీరు కృపచే నెందే వసింపన్ జయం
బటఁ గల్గున్ మదినెంచిచూడఁగ ధ్రువంబాశ్చర్య మా యిప్పుడ
క్కట! లోకైకశరణ్య! నీవిటు ననుం గారుణ్యదృష్టిన్ నుతిం
చుట నాభాగ్యముగాదె పద్మజముఖస్తుత్య ప్రభావాశ్రయా! 13

సీ. కర్తవు సకలలోకములకు నాద్యుఁడ
వఖిలకామప్రదాయకుఁడ వీవ
బ్రాహ్మణప్రియుఁడవు బహుయోగిమానసాం
భోజరాజత్పదాంబుజుఁడ వీవ
కల్యాణగుణుఁడవు కరధృతచక్రగ
దాశంఖశార్ఙ్గనందకుఁడ వీవ
భక్తవత్సలుఁడవు భవ్యనాభిసరోజ
జనితసరోరుహాసనుఁడ వీవ

గీ. యిట్టి మిమ్ము నుతింప నే నెంతవాఁడ
నిపుడె తనమీఁద వేంచేసి రిపుజయంబుఁ
గను మటన్న జయార్థ మర్ఘ్యం బొసంగె
స్వామి యతనికి జయజయధ్వనులు చెలఁగ. 14

గీ. అంత సాత్యకి మొదలైన యాదవులను
ద్వారకను యుంచి శౌరి యుదారలీలఁ
బన్నగాశనుపై బలభద్రమకర
కేతనులతోడ నెక్కి సంప్రీతుఁ డగుచు. 15

—: ఖగవాహనారూఢుఁడై గగనమార్గమున నేగు శ్రీకృష్ణుని చారణులు స్తుతించుట :—

ఉ. మాగధసూతవందిజనమానివహుల్ వినుతింప నేగుచో
వే గగనంబునందు జయవిశ్రుతభాషణులైన చారణుల్

నాగవిరోధిపై నతిబలస్ఫురణంబున నున్న శౌరికిన్
సాగిలి మ్రొక్కి యిట్లనుచు సంస్తుతిచేసిరి భవ్యసూక్తులన్. 16

సీ. జయ శంఖచక్రాసిశార్ఙ్గగదాధర!
కౌస్తుభశ్రీవత్సకలితవక్ష!
జయ నాభిపంకజసంభూతచతురాస్య!
అంబుధికన్యావిహారలోల!
జయ భువనత్రయాశ్రయచరణాంభోజ!
జగదుద్భవస్థితివిగమకరణ!
జయ దుష్టదైత్యకుం(జరసూ) దనమృగేంద్ర!
కమనీయనారదగానలోల!

గీ. అఖలదేవేశ! కోటిసూర్యప్రకాశ!
జలధరశ్యామ! కామితఫలదనామ!
అమితగుణహార! భవ్యదివ్యావతార!
ఘనమ[హీధరవ]రధారి! కంసవైరి!. 17

వ. అని మఱియును.

క. దురమున నెదరిన బాణా
సురు గెలుతువు సిద్ధమనుచు సొంపమరఁ బొరిన్
బొరిఁ బొగడువారి పలుకులు
సొరిది వినుచు నధికహర్షశోభితుఁ డగుచున్. 18

—: శ్రీకృష్ణుఁడు బలదేవాదులతో శోణపురి సమీపమునకుఁ జేరుట :—

ఉ. దానవభంజనుం డహిమధామసుధాకరపాకభేదివై
శ్వానరదుర్నిరీక్షతరసర్వదిగంతవిసారిభూరితే
జోనుగుణాత్మదేహుఁడయి యష్టభుజంబులుఁ దాల్చి నప్పుడా
దానవసూదనాగ్రజుఁడు దానును బాహుసహస్రభాసియై. 19

క. అతిభాస్వరమగు రూపము
నతిమానుషదివ్యతేజ మమరఁగఁ దాల్చెన్
రతిపతియు సత్ప్రభావో
చితమైన సనత్కుమారు దేహముఁ దాల్చెన్. 20

గీ. వినుము రాజేంద్ర! యటువలె వెలసె విహగ
వాహనారూఢుఁడైన యావాసుదేవు
నిపుడును దలఁచితలఁచి మాహృదయపంక
జంబు లానందరసభరితంబు లయ్యె. 21

గీ. అపుడు మధువైరి దక్షిణహస్తములను
జక్రకౌమోదకీఖడ్గశరము లలరె
సవ్యకరముల నాల్గిట సరవితోడ
శంఖకార్ముకఫలకపాశములు నమరె. 22

చ. అట గరుడుండు పక్షజనితామితభీషణఘోషణానిల
స్ఫుటదచలేంద్రకూటతటచూర్ణమహావిటపావనీజుఁడై
తటిదయుతప్రభాజటిలతారతనుద్యుతి నిండ దిక్కులన్
బటుజవయుక్తిచేఁ బఱచె భాసురలీల నభోంతరంబునన్. 23

వ. ఇట్లు గరుడుండు గగనమార్గంబునం జనుచుండఁ గృష్ణుఁ జూచి
బలభద్రుం డిట్లనియె.

క. హరిహారిద్రావర్ణము
లీరూపము లొదవె మనకు నేమిట నివు డా
మేరుశిఖరిచేరువ ను
న్నారమె యిదియేమి చెపుము నలినదళాక్షా! 24

క. అనుటయు నతనికి హరి యి
ట్లనియెను బలదేవ! యిచట నాహవనీయం
బనువహ్ని దివ్యతేజము
ఘనమై పొదువంగ నిట్టికాంతులు గలిగెన్. 25

చ. అనవుఁడు రేవతీరమణుఁ డాయదునందనుతోడ దైత్యభం
జన! యటులైన శోణపురిచాయకె వచ్చితి మార! యిప్పు డీ
యనలము శాంతిఁజెందఁగ నుపాయము నొక్కటిచూడుమన్నఁ దా
ర్క్ష్యునకు మురారి యెంతయును సొంపుజనింపఁగఁ బల్కె నీక్రియన్.

గీ. అమృతహరణప్రవీణ! యీయనల మిపుడు
కడచి చనఁగ నుపాయంబుఁ గనఁగవలయు
ననిన గరుడుండు సురసరిదంబువులను
దెచ్చి నించిన నగ్ని యదృశ్యమయ్యె. 27

వ. అంత.

—: శ్రీకృష్ణుఁడు శంభుబలములగు పావకులతోఁ బోరుట :—

మహాస్రగ్ధర

జలజాక్షానంగసంకర్షణులు ముగురు నిస్తంద్రశక్తిన్ ద్రిలోకం
బులు గెల్వంజాలు శూరుల్ భుజగరిపుజవస్ఫూర్తిచే నిట్టుల(త్యు)
జ్జ్వలకీలాజాలఘోరజ్వలనమును వ(డిన్)శాంతిఁ బొందించి యంతే
బలదర్పప్రాభవంబుల్ బలియఁ జనిరి తత్పట్టణాభ్యర్ణసీమన్. 28

క. అది గని శంభు(నియో)గము
న దివానిశమును ద(దీయనగరావన) కో
విదులగు ననేకపావకు
లదరి చెదరి గుంపుగూడి యందఱుఁ దమలోన్. 29

ఉ. భూరిబలాఢ్యుఁ డీవిహగపుంగవుఁ డీతనిమీఁద నెవ్వరో !
వీ(రులు శూరులా) ముగురు వీర లవక్రపరాక్రమాద్భుతా
కారు లుదారబాహుపరిఘస్ఫురదాయుధు లంచు నెంచి యే
(వారలు)గాఁగ నేమి ? యని వారలఁ (జంపఁగ) నిశ్చితాత్ములై.

క. కోపాటోపనితాంతో
ద్దీపితులై వారిఁ జేరి తీక్ష్ణశరంబుల్
పైపై దళముగఁ గురియు(చు)ఁ
జూపిరి తమశక్తియుక్తిఁ జూప(రి) మెచ్చఁగన్. 31

వ. అట్టి సమయంబున.

క. విని బాణుం డాకలకల
మును దనవేగరులలోన ముఖ్యుం(డగు) నొ
క్కనిఁ బిలిచి తెలిసి రమ్మని
ఘనసైన్యము లేర్పఱించెఁ గదనాపేక్షన్. 32

ఉ. వాఁడును వచ్చి యవ్విహగవాహనముఖ్యులతోడఁ బావకుల్
వాఁడిమిఁ బోరఁ గన్గొని జవంబున నేగి సుపర్వవైరితో
నేఁ డిపు డెవ్వరో ముగురు నిస్తులదీప్తి మహత్సఖాళితో
వేఁడిమిమైఁ బెనంగెదరు వీరవరేణ్య ! యటంచుఁ బల్కినన్. 33

వ. బాణాసురుండును నది సరకుగొనక యకంపితధైర్యుండై యుండె. అంత నిక్కడ కల్మాషుండును, కుసుముండును, దహనుండును, (తి)ష్మనుండును, తపనుండును, పటలుండును, పతంగుండును, స్వర్ణుండును, భ్రాజుండును, జ్యోతిష్టోముండును, హావిర్భాగుండును, అంగిరుండును మొదలగు ననేక పావకులు నిజానీకపరివృతులై వచ్చి ప్రద్యుమ్నవాసుదేవసంకర్షణులతో యుద్ధంబు

సేయునెడ వాసుదేవుండు రథారూఢుండై ముంగలఁ బ్రకా
శించు నంగిరుం జూచి యిట్లనియె.

క. నీవును మఱియును గల యీ
పావకులును రణమునందు భయకంపితులై
పోవక నిలిచిన మఱి నా
లావుం గనియెదరు మీదులావును దెలియన్. 34

గీ. అనినఁ గోపము రెట్టింప నంగిరుండు
కృష్ణుపైనిఁ ద్రిశూలంబుఁ ద్రిప్పి వైవ
నంతలోననె శౌరియు నర్ధచంద్ర
విశిఖముల నేసి కావించె విశిఖముగను. 35

వ. మఱియును.

క. స్థూణాకర్ణాస్త్రము హరి
తూణంబునఁ దిగిచి రొమ్ముఁదూఱఁగ నేయన్
శోణితము లొలుక నతఁడున్
బ్రాణంబులు తల్లడిల్ల వ్రాలె న్నేలన్. 36

—: అంగిరుని గూల్చి శ్రీకృష్ణుఁడు బాణుపురమును బ్రవేశించుట :—

వ. ఇట్లుగ్రచరుండైన యంగిరుండు మూర్ఛాపరవశుండై పడిన
శేషించిన పావకు లతని రథమున నుంచుకొని బాణపురంబుఁ
బ్రవేశించి రంత.

గీ. అంబుజాక్షుండు సింహనాదంబుఁ జేసి
భవ్యతరలీలఁ బూరించెఁ బాంచజన్య
మప్పు డాశౌరి గనుపట్టె నమృతకరుని
వెడలఁ ద్రాయు నభంబున విను నరేంద్ర ! 37

క. బలదేవప్రద్యుమ్నులు
నలఘుతరస్ఫూర్తి మెఱయ నట్లన శంఖం
బులుఁ బూరింపఁగ నల హరి
బలిమిఁ బ్రవేశించె వేగ బాణునిపురమున్. 38

వ. అప్పుడు శోణితపురంబునందు.

స్రగ్ధర.
ప్రద్యుమ్నోపేతసంకర్షణముఖకమలప్రస్ఫురద్దివ్యశంఖ
ప్రోద్యద్భూరిప్రణాదంబులు బహుపటహావ్యూహభేరీరవంబుల్
సద్యస్సన్నద్ధయోధాలఘురచితమహాసాహసక్ష్వేళనంబుల్
మాద్యత్పక్షీంద్రపక్షోల్లసితమహితఝంపాధ్వనుల్ గూడినిండెన్.

గీ. పట్టణము నాల్గుదిక్కులఁ బ్రబలి యిట్లు
భీషణంబగునట్టి యాఘోష మమరె
వననిధులు నాల్గు నొక్కదిక్కునను గూడి
భాసురంబుగ నొక్కట మ్రోసె ననఁగ. 40

—: శంభుబలములు శ్రీకృష్ణాదుల నెదుర్కొనుట :—

ఉ. శోణపురంబు వారలును జొచ్చుతరిన్ బహుయక్షపూర్వగీ
ర్వాణమహోద్భటప్రమథరాక్షసకోటులు విస్ఫురద్గదా
బాణమహోగ్రతోమరకృపాణములన్ ధరియించి యంబుద
శ్రేణులలీల గర్జనము సేయుచు నెంతయు భీషణాకృతిన్. 41

క. ఒక్కుమ్మడి వడి నడచుచు
నక్కజముగ నార్చి పేర్చి యతితీక్ష్ణములౌ
పెక్కమ్ముల నానలుగురి
వెక్కసముగఁ బొదవి రెల్లవీరులు మెచ్చన్, 42

వ. మఱియు నప్పుడు సమరనిశ్శంకంబులగు ననేకకింకరసైన్యంబులు జంగమనీలశైలంబులకైవడిన్ జనుదెంచి ప్రద్యుమ్నబలభద్ర వాసుదేవవైనతేయులమీఁదఁ ప్రళయానలదారుణంబులైన బాణంబులుఁ బ్రయోగించి తదీయాంగంబులం దొరగు రక్త పూరంబులఁ దుర్మదంబునం ద్రావి రౌద్రంబుగా నార్చుచు విజృంభించుసమయంబున బలభద్రుండు వాసుదేవునిఁ జూచి యిట్లనియె.

ఉ. అంబుజనాభ! యింక సముదగ్రత వీరల భూరిబాహుద
ర్పం బెడఁబాప కిట్టిసమయంబున నూరకయుండరాదు వే
గంబున నీదు తీక్ష్ణశరకాండములన్ నిగుడంగఁ జేసి నీ
లాంబుదశైలదేహుల మహాసురలం బొలియింపఁగాఁ దగున్.

చ. అనవుఁడు నట్లకాక యని యామురవైరియు నంతకోపమం
బున నతిభీషణంబు[1]నయి పొల్పు మహోజ్వలనాస్త్రముల్ రయం
బెనయఁగ నేసి తద్బలము నెల్లను గూలఁగఁ జేసి ముందఱం
జని మఱియున్ గనుంగొనియె సైన్యముఁ గాంక్షితఘోరజన్యమున్.

వ. అంత.

మ. పరశుప్రాసకుఠారతోమరగదాపాశాంకుశేష్వాసము
ద్గరశక్త్యృష్టిముఖాయుధంబుల మహోగ్రప్రక్రియన్ దాల్చి భీ
కరభేతాళపిశాచభూతగణరక్షస్సంఘముల్ భూరి సం
గరకౌతూహలయుక్తినార్చెఁ బెలుచన్ గ్రౌర్యంబవార్యంబుగన్.

ఉ. వారలఁ జూచి యిట్లనియె వారిజనేత్రునకున్ బ్రలంబసం
హారి యుపేంద్ర! యిచ్చటియుదారబలంబుల నేనుఁ గిట్టి దు

1. భీషణంబునునై.

ర్వారత గెల్చెదన్ విహగరాజును నియ్యెడ డిగ్గి నావుడున్
శౌరియు నట్లకాక కదనంబును సేయుద మంద ఱుఁకటన్. 46

—: యుద్ధముఁజేయ బలభద్రాదుల వేర్వేఱుచోట్ల శ్రీకృష్ణుఁడు నియోగించుట :—

వ. అని పల్కి సుపర్ణుని డిగ్గె నప్పుడు బలభద్రప్రద్యుమ్నులును తోడన డిగ్గి రప్పు డప్పుంకజాక్షుండు పన్నగాశనప్రద్యుమ్నబల దేవులఁ బేర్వేరం బేర్కొని యిట్లనియె.

సీ. పన్నగాశన ! నీవు వెన్నాసగా నిల్చి
యటవచ్చు నహితుల నడఁచవలయు
రేవతీప్రియ ! నీవు నావలపలిదిక్కు
నను నిల్చి రిపులతోఁ బెనఁగవలయుఁ
బ్రద్యుమ్న ! నీవు డాపలిదెసకై నిల్చి
యరిసంఘములనెల్ల నుఱుమవలయు
బలములఁ జెదిరి విచ్చలవిడి వడి నేను
దోశ్శక్తిఁ దునిమెదఁ దునుమవలయు

గీ. యసురనివహమునెల్ల నటంచుఁబలుకు
నంతలోనన తద్బలమంత నింతఁ
గదియవచ్చిన శౌరియుఁ గదిమె నంత
గుఱుతరంబుగ నల పోరు ఘోరమయ్యె. 47

—: ఘోరయుద్ధమున శంభుసైన్యము పరాజయమునొందుట :—

క. హలధరుఁడు నుగ్రుఁడై లాం
[1]గలమున దానవగణంబుఁ గదియుచుఁ బెనుఁగు
ప్పలుఁగాఁ బడఁజేయుచుఁ దన
బలస్ఫురణ రణమునందుఁ బ్రబలఁగఁజేసె. 48

1. గలమున దానవగణంబు గదిశెఁ

వ. మఱియును.

చ. ప్రళయమహాకాళసప్రకరభానురుఁడై యెదిరించు వీరులన్ చ్రున్
హాలమున నీడ్చియీడ్చి ముసలాగ్రమునన్ బడఁ గ్రుమ్మి చిమ్ము
బలుమఱు నిట్లు రౌద్రనిజభావముఁ జూపుచునుండఁగోట్లు కొం
[1]డలుగఁ బడం దొణంగి రచటన్ బ్రమథప్రబలారిసైనికుల్. 49

క. ప్రద్యుమ్నుం డరితిమిర
ప్రద్యోతనుఁ డగుచు నిశితబాణవితతిచే
విద్యున్నిభదంష్ట్రుల సమ
రోద్యుక్తులఁ ద్రుంచె దనుజయూథాధిపులన్. 50

గీ. శంఖచక్రగదాఖడ్గశార్ఙ్గధారి
కంసవైరియు నిజకరకౌశలంబు
మెఱయ రయమున శరములు నెరయఁజేసి
రక్కసుల భూరిదర్పంబు నుక్కడంచె. 51

క. పక్షికులాధ్యక్షుఁడు సం
ధుక్షితనిజపక్షతీక్ష్ణతుండాగ్రములన్
రక్షోనివహంబుల ముఖ
వక్షంబుల నడఁచి వ్రచ్చి వందఱలాడెన్. 52

క. ఈపగిది నలుగురు భుజా
టోపంబులఁ జూపు నప్పుడు సురారిభటుల్
చాపంబులు దిగవిడిచి క
కావికలై చనిరి (మి)కులఁ గలఁగంబడుచున్. 53

---

1. డలుగఁబడం దొణంగిరచటన్ బ్రమథప్రముఖ ప్రబలారి సైనికుల్.

గీ. అంత బలదేవమదనవిహంగనాథు
లెంతయుం బేర్చి యార్చిరి సంతసమున
నసురభీకరఘనరవంబయిన పాంచ
జన్యమును వేగ పూరించెఁ జక్రధరుఁడు. 54

—: మహేశ్వరశక్తిపీడితుఁడగు బలదేవుఁడు శ్రీకృష్ణునివలన తద్విముక్తిఁ జెందుట :—

వ. అంత నిట్లు కింకరసైన్యంబు దైన్యంబుఁజెంది సంగరంబుఁ జాలించి భయంబున దిశలకు సంభ్రమించు నవసరంబున మహేశ్వరప్రేరితంబైన మహాజ్వరంబు భయంకరాకారంబై హస్త మస్తకచరణత్రితయంబులు గలిగి భసితప్రహరణంబై ధారాధర సహస్రంబునుంబోలె గర్జింపుచు వచ్చి వాసుదేవాగ్రజునిం గని.

మ. ఎటు బోవంగలవాఁడ వింక నిదె యుద్వృత్తిని నినుం గిట్టి మ
త్పటుబాహాబలయుక్తిఁ జూపెద మదాంధత్వంబు ప్రాపించి న
న్నిటు లేలా యెఱుఁగంగఁజాల వీటమీఁ దెట్లయ్యెడో యంచు న
ట్టటహాసంబు నొనర్చి పైఁబడియె నుద్యన్ముష్టిబంధోగ్రమై. 55

గీ. రౌహిణేయుఁడు నెదిరించి బాహుయుద్ధ
కౌశలముఁ జూపి మండలాకారముగను
దిరిగెఁ దీఱఁగ మహేశ్వరజ్వరము నొంచి
యతని యతిఘోరముష్టిప్రహారములను. 56

వ. మఱియు నమ్మహేశ్వరజ్వరంబు.

క. తన సవ్యకరమునందలి
ఘనభసితము బలునిరొమ్ముఁ గదియఁగ వ్రేయుచు
జని యదియు నతనివక్షం
బునఁ బడ నొకకొండభంగి భూరిస్ఫూర్తిన్. 57

క. గ్రక్కునఁ బ్రబలంబై రియు
నక్కజముగ భసిత మొదలు(నట్లు)గఁ ద్రోయఁగా
జిక్కిన తచ్ఛైమంబును
మిక్కిలిఁ దాపంబు నతని మేనం జూపెఁ. 58

సీ. బలభద్రుఁ డపుడు కన్నుల నిద్రజేరంగ
నావులింపుచు భ్రమం బావహిం(చి)
(చు)ట్టుఁ దిరుగుచు నిట్టూర్పువుచ్చుచు
రోమాంచమిళితగాత్రుండు నగుచు
నల్లనల్లన వచ్చి యల్లజనార్దనుఁ
జేరి దేవోత్తమ! చిత్స్వరూప!
కృష్ణ! హృషీకేశ! యిప్పు డీతాపంబు
నేర్పుమై శాంతిఁ బొందింపు మనినఁ

గీ. కమలదళనేత్రుఁ డాబలుఁ గౌఁగలించి
జ్వరకృతంబైన తాపంబుఁ జనఁగఁ జేసె
నంత యెప్పటియట్ల యనంతబలుఁడు
[1]ప్రబలుచుఁ బ్రకాశించెను భవ్యలీల. 59

—: శ్రీకృష్ణుఁడు మహేశ్వరశక్తితో యుద్ధముచేసి జయించలేక ప్రతిశక్తిని నిర్మించుట — రౌద్రవైష్ణవశక్తుల యుద్ధము :—

వ. ఇవ్విధంబున నిజాగ్రజుం బృహృష్టాంతరంగుఁ గావించి పుండరీకాక్షుండు మహేశ్వరజ్వరంబునగ్రంబున నిలిచి యిట్లనియె.

గీ. దుర్మదము మాని తొలఁగు నీపేర్మి యింకఁ
జెల్ల దీయుడఁ గాదని చేరితేనిఁ
గఠిననిర్ఘాతసమముష్టిఘాతములను
నీదుగర్వం బణంచెద నిక్కువంబు. 60

1. ప్రబలి ప్రకాశించె భవ్యలీల.

క. అనుటయు నది కోపంబున
నలంబును బోలె నుజ్వలాకారంబై
తనసవ్యేతర బాహువు
లను భసితము విసరె నతఁడు లక్ష్యముగాఁగన్. 61

వ. అంత,

సీ. శౌరి మహేశ్వరజ్వరకల్పితంబగు
సంతాప మందె నొక్కింతతడవు
జ్వర మంతలోన భుజంగమాకృతులైన
తనభూరిహస్తంబులను దదీయ
కంఠంబుఁ జుట్టిచి తత్కఠినవక్షమునందు
ముష్టిచేఁ బొడిచిన మురహరుఁడును
శీఘ్రముం(బ) యుగ్రముష్టిప్రహారంబుల
జ్వరముశిరంబు వక్షంబు నొంచె

గీ. నదియు నతనియురంబును హస్తములను
జుట్టిచి కరచిన నాహరి సస్మితముగఁ
దన (కరగదను) దాని వక్త్రంబు నడఁచి
త్రోసె నది బల్మి మఱియును దాసె నతని. 62

వ. ఇట్లు భుజత్రయంబుగల మహేశ్వరజ్వరంబును నెనిమిది భుజం
బులుగల గరుడధ్వజుండును బ్రకటగిరికటకనికటకటపతిత నిర్ఘాత
తులితధ్వానంబులైన ముష్టిఘాతంబులఁ బరస్పరంబు నురస్థ
లంబు నొంచుచు ధారాధర స్తనితగంభీరంబుగా నార్చుచు

ఘోరంబుగాఁ బోరునట్టియెడ, వియచ్చరవరు లచ్చెరుపడి మున్నెన్నఁడు నిట్టిసమరంబు గన్నవిన్నయది గాదని పొగడు వచనంబులు గగనంబున నిగుడ నంత దానవాంతకుండు నెంతయుఁ గోపాటోపంబు దీపింప నమ్మహేశ్వరజ్వరంబును నిగ్రహింపఁ దలంచి కుపితసమవర్తి (వశవర్తి ప్రతిఘుంబ (న)ఁ దగు నిజభుజాపరిఘుంబున వజ్రకఠినంబగు తద్వక్షంబు గుల గులలుగా నగల్చి గర్జించి బాహువులఁ బట్టి నేలఁ బడఁద్రోచిన, తద్బాహువులవెంబడిఁ దదీయహృదయంబుఁ బ్రవేశించి మఱియు ఖేదంబుఁ బుట్టించె, నమ్మధుసూదనుఁడును మహేశ్వరజ్వర ప్రవేశవ్యాకులితాంతరంగుండై క్షణమాత్రంబు గాత్రంబు గగుర్పడ నావులింపుచు నిద్రాపరవశత్వంబు నొంది, యిట్టి గుణంబు ( లఁ గలది తజ్జ్వరమని మనంబు) న నెంచి కోపించి తజ్జ్వరంబు నిగ్రహింపఁజాలిన ప్రతిజ్వరంబుఁ గల్పించిన, నదియును నాల్గుభుజంబులును నాల్గుముఖంబులును నాల్గు విధము)లైన యాయుధంబులు ధరించి మాహేశ్వరజ్వరంబు నెదిరించి సింహనాదంబుఁ జేసి బాహుయుద్ధంబునకుం జొచ్చి (వివిధగతుల యుద్ధముఁ జేయుచునుండ గం)ధర్వగణంబు లంతరిక్షంబున నిల్చి విస్మయాయత్తచిత్తులై వీక్షింపుచుండి, రంత మహేశ్వరజ్వరంబు.

క. పవిసమహాస్తమ్మున వై
ష్ణవ (బలములు మిగు)లఁ గూలఁ జఱచిన నదియుఁ
జవమగి బహువికృతస్వ
ర్షనములు గావించె మిగుల రౌద్రముగాఁగ౯, 68

గీ. అంతఁ గోపము రెట్టింప నంతకోప
మాకృతిని వైష్ణవజ్వరం బాజ్వరంబు
మస్తకంబులు నిజఘోరహస్తములను
జదియ మోఁదుచు మఱియు వక్షంబు నడిచె. 64

చ. అడిచిన శాంకరజ్వ............జేసి తజ్జ్వరం
బుడుగక పైఁబడన్ సునిశితోగ్రగవంబులచే తదీయనా
వెడఁద యురంబున...................
.......యుద్ధము నహీనబలంబునఁ జేయు నత్తరిన్. 65

ఆ. వైష్ణవజ్వరంబు వడి శాంకరజ్వరం
బును నిజోగ్ర.....................
.........................
..................లను జాలగాసి నేసె. 66

వ. అంత.

ఉ. ఘోరతరస్వరంబునను గూయిడునట్టి జ్వరం............
...రము సేసెదం గను మటంచును బెట్టుగనార్చె శౌరియున్
గ్రూరమహేశ్వరజ్వరము గూలు................
............................డె నద్భుతంబుగన్. 68

గీ. కృష్ణదేవ! యదూద్వహా! యీజ్వరమును
గృపను వీక్షించి...............
.........................
............ముగాఁ బల్కె నచట నాకాశవాణి. 68

క. వనజాక్షుఁడు తద్వాక్యము
విని రౌద్రజ్వర.....................
.................................
.............యుచు నదియు నధికహర్షముతోడన్. 69

మ. అనుతాపంబును జెంది శౌరికిని సాష్టాంగ......
.........ము............మంబునం జేర్చి యో
దనుజారాతి! త్రిలోకనాయక! సురేంద్రస్తుత్య పాదాంబుజా!
నను రక్షింపుమట.................. 70

—:o:—

# పద్యానుక్రమణిక.

---

# తప్పొప్పుల పట్టిక

—:o:—

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 10 | సంగరంగ | సంగరరంగ |
| 5 | 4 | కృతభర్తృ | కృతిభర్తృ |
| 6 | 1 | ,, | ,, |
| 15 | 14 | పరచుట | పఱచుట |
| 20 | 19 | దెచ్చుటకై | తెచ్చుటకై |
| 25 | 9 | ఇంతఁ జింతింపంగ | ఇంత చింతింపంగ |
| 46 | 7 | నెచ్చలి | నెచ్చెలి |
| 56 | 10 | కేఁగుట | కేగుట |
| 75 | 7 | మీఁదనే | మీఁదనె |
| 90 | 1 | బాణాసుని | బాణాసురుని |
| 91 | 5 | చెలింపనేల | చలింపనేల |
| 99 | 22 | చిన్నిప్రాయంబునఁ | చిన్నిపాయంబునఁ |

———